చందా వివరములు
బుధవారపు సచిత్ర వారపత్రిక
రూ. [నయాపైసలు]
సంవత్సర చందా ... 18 00
అర్ధ సంవత్సర చందా ... 6 50
విడి ప్రతిక ... ,, 25
భారతి (సచిత్ర మాసపత్రిక)
సంవత్సర చందా ... 12 00
అర్ధ సంవత్సర చందా ... 6 00
విడి ప్రతి ... 1 00
ఆంధ్ర పత్రిక — మద్రాసు-1.

# ఆంధ్రపత్రిక

3|1521

చందా వివరములు
ఆంధ్ర దినపత్రిక
రూ. [నయా పైసలు]
(ఆదివారపు సంచికలో సహా)
సంవత్సర చందా ... 28 00
అర్ధ సంవత్సర చందా ... 14 00
3 మాసముల చందా ... 7 00
నెల చందా ... 2 50
విడి ప్రతి సాధారణదినములలో ... ,, 7
ఆదివారపు దినపత్రిక ... ,, 18
ఆంధ్ర పత్రిక — మద్రాసు-1.

The Andhra Patrika - Madras సంపుటం 44. సంచిక 95 FOUNDER: DESODHARAKA K. NAGESWARA RAO శనివారం 6-7-1957 Reg. No. M. 1118 6 పేజీలు 7 నయాపైసలు

# గోదావరి నీటి తరలింపు పరిశోధనకు సిబ్బంది లేదు

## రష్యాలో మార్పులపట్ల నెహ్రూ సుముఖభావం

### అక్కడున్న అసహజస్థితి ఇక తొలగవచ్చు'

### అణురజోదోషంలేని బాంబులవల్ల ప్రమాదం లేకపోలేదని సంశయం

లండన్, జూలై 4: సోవియట్ యూనియన్‌లో మార్పులు శుభదాయకమైనవని, భారత ప్రధాని శ్రీ నెహ్రూ ఇవాళ పత్రికా సమావేశంలో అన్నారు.

ఆ దేశంలో దీర్ఘకాలంగా ఉన్న అసహజస్థితి తొలగిపోయి, క్రమక్రమంగా సహజస్థితి ఏర్పడుతున్నదని, ఈ మార్పులనుబట్టి భావిస్తున్నట్లు శ్రీ నెహ్రూ చెప్పారు.

కమ్యూనిస్టుపార్టీ అధ్యక్షమండలి నుంచి కొందరినితొలగించడం, అక్కడ కొంతకాలంగా వస్తున్న మార్పులకు నిదర్శనం కావచ్చునని శ్రీ నెహ్రూ అన్నారు.

మహావిప్లవం సంభవించిన ప్రతిదేశంలోనూ, ఆ విప్లవం అనంతరం, తిరిగి సహజస్థితి క్రమక్రమంగా ఏర్పడుతుంది.

విప్లవం అనేది సహజమైనది కాదు; అది అసాధారణ పరిస్థితి, అని శ్రీ నెహ్రూ అన్నారు.

అయితే రష్యాలో ఆశ్చర్యకరమైన సంగతేమిటంటే, ఒక మోస్తరు సహజస్థితి రావడానికి అతి దీర్ఘకాలం పట్టింది.

రెండు ప్రపంచ యుద్ధాలు, ఒక అంతర్యుద్ధం, దేశంలో అనేకరకాల సంఘటనలు వీని మూలంగా తిరిగి సహజస్థితి నెలకొనడానికి ఇంత ఆలస్యం పట్టిఉండవచ్చు, అని శ్రీ నెహ్రూ అన్నారు.

అయితే నిన్నటి బర్తరఫ్‌లు కాకుండా, ఇటీవల కొంతకాలంగా రష్యాలో జరుగుతున్న మార్పులను దృష్టిలో పెట్టుకుని మాట్లాడుతున్నట్లు శ్రీ నెహ్రూ చెప్పారు.

రష్యాలో మార్పులను గురించి విలేఖరులు ప్రశ్నించినప్పుడు, ఇతర దేశాలలో పరిణామాలను గురించి ఏ విదేశాంగమంత్రీ అట్టే మాట్లాడ్డం మంచిది కాదని, మొదట శ్రీ నెహ్రూ అంటూ పైమాటలు చెప్పారు.

తరువాత మరికొన్ని ప్రశ్నలకు జవాబులిస్తూ, శ్రీ నెహ్రూ ఈ క్రింది అభిప్రాయాలు వెలిబుచ్చారు.

రష్యాలో పూర్వతరాలవారికీ, ఇప్పటి కొత్తతరానికీ ఎంతో వ్యత్యాసం ఉంది. ఇది నేటి రష్యా విశిష్టత. రష్యాలో 40 ఏళ్ళ వయస్సుకు లోబడిన వారందరూ, అంటే రష్యా జనాభాలో కార్మికవర్గం దాదాపు యావత్తూ, విప్లవకాలంలోనో తరువాతనో పుట్టి పెరిగినవారే.

వారందరినీ సాంకేతిక నిపుణులుగా శిక్షణఇచ్చి తయారుచేశారు. అమెరికన్లు మినహా ప్రపంచంలో ఈనాడు రష్యన్లను మించి సాంకేతిక దృక్పథం కలవారు మరెవ్వరూ లేరు.

రష్యా ప్రజలు ప్రకృతిత: ఇతరులను ఆదరించే ఉదారులు; స్నేహస్వభావులు. వారిలో ఆర్ద్రిత, ఆవేశం కూడా అధికమే. ఇతరులలో మంచి చేష్టలకు ఇట్టే ఆర్ద్రీభావమో, ఆవేశమో తెచ్చుకునే స్వభావం వారిది.

క్లిష్ట విషయాలను, గ్రంథాలను ఎంతో ఓపికతో పరిశీలించి పఠించే లక్షణం ఆ జాతి అంతకీ సామాన్యం. శాంతి, సహజ వాతావరణాలంటే వారికి గాఢమైన ఆకాంక్ష. ఎందువల్లనంటే, అనేక సంవత్సరాలు వారు అసాధారణ స్థితిలో అసహజ వాతావరణంలో జీవనం గడిపారు.

ఇప్పుడున్న సామాజిక ఆర్థిక రాజకీయ వ్యవస్థలను రష్యాలో అందరూ ఆమోదించారు, అవి మార్చాలని ఆదేశంలో ఎవరికీ కోరికలేదు.

అయితే వ్యక్తిగత స్వేచ్ఛ అధికంగా కావాలనీ, కొనుక్కోడానికి వస్తు సామగ్రి అధికంగా లభించాలనీ కోర్కె మాత్రం ఉంది.

### రష్యా అమెరికాల మధ్య పోలికలు

రష్యన్లు అమెరికన్ల మధ్య చాలా పోలికలున్నట్లు, రష్యా వెళ్ళినప్పుడు గమనించి ఆశ్చర్యపోయానని శ్రీ నెహ్రూ చెప్పారు.

ఉభయ దేశాల ప్రజలూ ఉదారులు, స్నేహశీలురు, ఇతరులను ఆదరించే స్వభావం కలవారే. కాని ఉభయ ప్రజలూ కొంత ఆవేశ పూరితులే. అందువల్లనే మైత్రికికాని, వైరానికి తక్షణం ఒడబడతారు. కొద్ది చికాకు కలిగినా సరే, కోపం తెచ్చుకుని బిర్ర బిగిసి పోతారు.

### నిరాయుధీకరణ అన్ని అంశాలలో ఒప్పందం కష్టం

నిరాయుధీకరణ సమస్యపై ప్రశ్నలకు జవాబులిస్తూ, శ్రీ నెహ్రూ, అన్ని అంశాలపైనా తక్షణం ఒప్పందం కుదరడం కష్టం అన్నారు. ఆ సమస్యలక్షణం అటువంటిదన్నారు.

అందువల్ల క్రమేణా సమస్య పరిష్కారానికి దారితీసే ఏ చిన్న అంశం కనపడినా తమకు ఆమోదమే అని చెప్పారు. మెట్టు తరవాత మెట్టుగా జాగ్రత్తగా వ్యవహరించుకుంటూ పరస్పర అవిశ్వాసాలు క్రమేణా తగ్గగలవు.

నిరాయుధీకరణ, అణ్వస్త్రాలే కాకుండా సాధారణ ఆయుధ సామగ్రి తగ్గించడం అత్యంత ప్రధానమైనవే.

కాని, అణ్వస్త్ర పరీక్షల విషయంలో తమకు గట్టి అభిప్రాయాలున్నాయని శ్రీ నెహ్రూ అన్నారు.

ఆ పరీక్షలను నిలిపివేసినట్లయితే నిజానికి ఎవరికీ హానికలగదు. నిలిపివేస్తే సకల సమస్యల చర్చకు తగు వాతావరణం ఏర్పడుతుంది. ప్రపంచమంతటా సర్వదేశాలలో ప్రజలు యీ పరీక్షల విషయమై ఆందోళన చెందుతున్నారు.

### పరీక్షలు కొద్దిమాసాలే నిలిపితే లాభంలేదు

అణ్వస్త్ర పరీక్షల నిషేధావసరాన్ని నిషేధ ప్రక్రియను చర్చించే ఈలోగా పరీక్షలు నిలిపివెయ్యాలని నాలుగేళ్ళనాడు భారతదేశం సూచించింది. ఈ సూచనకు అనేక ప్రభుత్వాలు

(5 పుట చూడుడు)

### జిల్లా బోర్డులకు ఎన్నికలు

#### ఉభయ ప్రాంతాలలోనూ సంకల్పం

హైదరాబాదు, జూలై 24: ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలలోని జిల్లా బోర్డులకు ఎన్నికలను ఒకేసారి జరపాలని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం సంకల్పించింది.

పత్రికల ప్రతినిధులకు ముఖ్యమంత్రి శ్రీ సంజీవరెడ్డి ఇవాళ్ళ యీ సంగతి చెప్పారు. రాష్ట్ర మంతటిలోనూ జిల్లా బోర్డుల ఎన్నికల నిర్వహణకు ఒకే ఒక పద్ధతిని రూపొందించాలనుకొంటున్నామనీ, ఇందుకు ఉభయ ప్రాంతాలలో ఇప్పుడు అమలులో ఉంటున్న జిల్లా బోర్డుల చట్టాలను సవరించవలసి రావచ్చనీ ముఖ్య మంత్రి చెప్పారు.

ప్రస్తుతం ఈ వ్యవహారం ప్రభుత్వ పరిశీలనలో ఉన్నది. ఎన్నికల తేదీ విషయమై ప్రభుత్వం త్వరలో ఒక నిర్ణయం చేస్తుందనికూడా శ్రీ సంజీవరెడ్డి వివరించారు.

## 'కృష్ణా పెన్నలమీదుగా దక్షిణాదికి నీటిసప్లయ్'పై ముఖ్యమంత్రి ప్రకటన

### ప్రస్తుతం తగు ధనంకూడా లేదని వివరణ

హైదరాబాదు, జూలై 5: గోదావరిజలాలను మదరాసు రాష్ట్రానికి లభింపచెయ్యడానికి వీలుగా గోదావరిని, కృష్ణతోనూ, పెన్నతోనూ కలిపేగాని పథకాలుగానీ, పరిశోధనలను జరిపించేందుకు అవసరమైన సిబ్బందిగానీ, డబ్బుగానీ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంవద్ద ప్రస్తుతం లేవని ఇవాళ శాసనసభ ప్రశ్నోత్తరాలసమయంలో ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి చెప్పారు.

"అయితే, గోదావరి జలాలను మదరాసు రాష్ట్రానికి సప్లయి చేయించాలనే నా కోరిక, అంతమాత్రాన ఈ పథకం సాధ్యాసాధ్యాలను పరిశీలించేందుకని ప్రస్తుతం పరిశోధనలు జరుగుతున్న ఇచ్ఛంపల్లి, పోచంపాడు ప్రాజెక్టులను ప్రభుత్వం విరమించుకొంటుందని అనుకోరాదు." అని కూడా శ్రీ సంజీవరెడ్డి చెప్పారు.

"గోదావరిని కృష్ణతోనూ, పెన్నతోనూ కలిపే ప్రాజెక్టు పరిశోధనలు చేయించ దలచుకున్నారా" అని శ్రీ జి. యల్లమందారెడ్డి ప్రశ్నించగా నీటి పారుదల సౌకర్యాలూ, విద్యుచ్ఛక్తి శాఖమంత్రి 'లేదు' అని సమాధానం చెప్పారు. అంతలో ముఖ్యమంత్రి కలిపించుకుని పైన వివరించినట్టు చెప్పారు.

గోదావరి జలాలను దక్షిణ భారతానికి సప్లయించేసే పథకాన్ని వెంటనే ప్రభుత్వం ప్రారంభిస్తుందని అర్థమిచ్చే దేమీ మదరాసులో తాము చేసిన ప్రసంగాలలో లేదని శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య తదితరులు ఈ సందర్భంలో అడిగిన ఇతరప్రశ్నలకు ముఖ్యమంత్రి సమాధానం చెప్పారు.

### తుంగభద్రబోర్డు పునర్నిర్మాణం సమస్య

తుంగభద్ర ప్రాజెక్టు బోర్డును పునర్ వ్యవస్థీకరించే సమస్యను ప్రభుత్వం పరిశీలిస్తోంది. ఈ సందర్భంలో కొన్ని ప్రతిపాదనలను కేంద్ర ప్రభుత్వానికి రాష్ట్ర ప్రభుత్వం పంపించిందని శ్రీ విశ్వేశ్వరరావు అడిగిన ప్రశ్నకు నీటిపారుదల సౌకర్యాల శాఖ మంత్రి జవాబు చెప్పారు.

అంతలో ముఖ్యమంత్రి కలిపించుకొని ఇట్లా చెప్పారు: "తుంగభద్ర ప్రాజెక్టుబోర్డులో ఇంతవరకు దాకా హైదరాబాదు రాష్ట్రానికి కూడా ప్రాతినిధ్యం ఉంటూవచ్చింది. ఇప్పుడు ఆ అవకతవకను తొలగించి ఆంధ్రప్రదేశ్, మైసూరు రాష్ట్రాలకు బోర్డులో తగిన ప్రాతినిధ్యం ఇవ్వడమే ఈ పునర్ వ్యవస్థీకరణ ప్రధానోద్దేశం"

### ప్రభుత్వం నిషేధించిన గ్రంథాలు

అభ్యంతరకరమైన అంశాలు ఉండడంవల్ల "క్రైస్తవమత రహస్యం," "జీసస్ తాగుబోతు" అనే రెండు తెలుగు గ్రంథాలను ప్రభుత్వం నిషేధించిందని శ్రీ ఎమ్. నాగిరెడ్డి ప్రశ్నకు ఆంతరంగిక వ్యవహారాలశాఖ మంత్రి సమాధానం చెప్పారు.

అమరావతి. మంగళగిరి జాతీయ వికాస కేంద్రాలు ప్రారంభమైనప్పుడు సత్తెనపల్లి తహసిల్దారునూ, మంగళగిరి డిప్యూటీ తహసిల్దారునూ వాటికి అధికారులుగా నియమించడం జరిగిందని శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య ప్రశ్నకు ప్రణాళికలూ, అభివృద్ధి శాఖల మంత్రి సమాధానం చెప్పారు. ఆ తరువాత ఆ కేంద్రాలకు ప్రత్యేకంగా అభివృద్ధి శాఖ ఉద్యోగులను నియమించారు.

ఖమ్మం కళాశాలకు రు 50 వేల విరాళమిచ్చే ప్రతిపాదనే మీ భద్రాచలం దేవస్థానం పరిశీలనలో లేదని శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య ప్రశ్నకు ధర్మాదాయ, దేవాదాయాలశాఖ మంత్రి సమాధానం చెప్పారు.

ఇతర సంస్థలకు దేవస్థానం సొమ్మును విరాళంగా ఇచ్చే ముందు దేవస్థానం అవసరాలకు డబ్బును వెచ్చించడం అవసరమని ఈ సందర్భంలో వచ్చిన ఇతర ప్రశ్నలకు ముఖ్యమంత్రి సమాధానం చెప్పారు.

## నాగార్జునసాగరం డాము రాతికట్టడం

### ఈ నెల 12 నపనికి ప్రారంభోత్సవం

హైదరాబాదు, జూలై 4: నాగార్జునసాగరం డాము రాతికట్టడం పనికి కేంద్రప్రభుత్వ నీటిపారుదల సౌకర్యాలూ, విద్యుచ్ఛక్తిశాఖ మంత్రి శ్రీ ఎస్. కె. పాటిల్ ఈ నెల 12 న ప్రారంభోత్సవం చేస్తారని ఇవాళ ఇక్కడ అధికార రీత్యా ప్రకటించారు.

కృష్ణానదిఎడమగట్టుపైడామునిర్మాణ స్థలంవద్ద ఈ ప్రారంభోత్సవం జరుగుతుంది. సభకు ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి అధ్యక్షత వహిస్తారు.

నాగార్జున సాగరం ప్రాజెక్టు మొత్తం నిర్మాణానికి రు 122 కోట్లు అవుతుంది. కేంద్ర ప్రభుత్వ నీటిపారుదల సౌకర్యాలశాఖ ఉపమంత్రి శ్రీ హైసుక్ లాల్ హాథీ ఇటీవల ఈ ప్రాజెక్టును చూశారు. దేశంలో ఆహారధాన్యాలు తక్కువగా ఉన్నవి కనుక మొదట అనుకున్నదాని కంటే త్వరగానే ఈ ప్రాజెక్టుద్వారా వ్యవసాయానికి నీళ్ళు సప్లయి కాగలవని ఆయన ప్రకటించారు.

మొదటి పంచవర్ష ప్రణాళిక చివరి దశలో నాగార్జున సాగరం ప్రాజెక్టు మంజూరయింది. పని కిందటి సంవత్సరం ప్రారంభమయింది. ఈ సంవత్సరం ఈ ప్రాజెక్టునిర్మాణం పనికి రు 650 లక్షలు మంజూరుచేశారు.

### విదేశీయులకు కారాగార వాసం

న్యూఢిల్లీ, జూలై 4: మొత్తం రు 8 లక్షలు విలువగల భారతీయ ద్రవ్యం, విదేశీ ద్రవ్యాలను, ప్రభుత్వ అనుమతిలేకుండా ఇక్కడనుంచితీసుకుపోవడానికి ప్రయత్నించినందుకు రసెల్ ఫ్రాన్సిస్ వెట్ అనే బ్రిటిష్ జాతీయులికి, మాడవిన్ పాలెట్ అనే ఫ్రెంచియువతికి, న్యూఢిల్లీ మేజస్ట్రేటు ఏడాది కారాగారవాస శిక్ష విధించారు.

## తుమ్మపాల పంచదార ఫ్యాక్టరీ మూసివేత

### చెరుకు రైతుల ఆందోళన

అనకాపల్లి, జూలై 3: తుమ్మపాల పంచదార ఫ్యాక్టరీ యజమానులు నిన్న ఉదయం అకస్మికంగా ఫ్యాక్టరీ మూసివేశారు. తుమ్మపాల చెరుకు రైతులకు ఇది చాల ఆందోళన కలిగించినది. చెరుకు రైతులు నిన్న ఫ్యాక్టరీ వద్ద చేరి తమవద్ద ఉన్న చెరుకు ఆడకుండానే ఫ్యాక్టరీ మూసివేయరాదని, కనీసం కంట్రాక్టుతీసుకొన్న మొత్తం చెరుకు అయినా ఆడాలని కోరుతూ ప్రదర్శన జరిపారు. రైతుసంఘ కార్యకర్త శ్రీ గోవిందరావు ఈ విషయంలో ఫ్యాక్టరీ యజమానులతో రాయబారాలు జరిపి ఈ తగాయిదా శాంతియుతంగా పరిష్కరించడానికి ప్రయత్నించనున్నట్లు రైతులతో చెప్పి వారి ఆందోళన కొంతవరకు తగ్గించారు.

ఫ్యాక్టరీ యజమానులు ఇతర ప్రాంతాల నుంచి చెరుకు దిగుమతి చేసి దానిని ఆడి ఫ్యాక్టరీ అకస్మికంగా మూసివేశారు. దానితో ఆ ప్రాంతంలోని రైతులవద్ద చెరుకు నిలువ ఉండిపోయినది. అదె రైతుల ఆందోళనకు కారణం.

శ్రీ గోవిందరావు ఈ రోజున రైతుల తరఫున ఫ్యాక్టరీయజమానులతో సంభాషణలు జరిపారు. ఫ్యాక్టరీయజమానుల కోరికపై పోలీసులు ఫ్యాక్టరీవద్ద బందోబస్తు ఏర్పాట్లు చేశారు. స్వ. వి.

### సిరియా దేశరక్షణ మంత్రి బహిష్కారం?

డెమాస్కస్, జూలై 4: సిరియా విదేశాంగమంత్రి శ్రీ బిరుదగ్, దేశరక్షణ మంత్రి శ్రీ ఖలీద్ అల్ అజం ఇవాళ విమానంలో బయలుదేరి రోమ్ నగరం వెళ్లిపోయారు.

సౌదీ అరేబియా రాజును "అమెరికన్ల చేతి కీలుబొమ్మ" అని శ్రీ అజం నిందించినందుకు ఆరాజు కోపం చెందారనీ, వారికోపం తీర్చడానికి ఒకవిధంగా శ్రీ అజంను సిరియాప్రభుత్వం దేశం నుంచి బహిష్కరించి ఉంటే వచ్చునని పత్రికలు అనుమానం వెలిబుచ్చుతున్నాయి.

### అంతశ్శత్రులవల్ల కమ్యూనిజం మార్పు

#### ఢేబర్ అభిప్రాయం

లక్నో, జూలై 5: అంతశ్శత్రుల ప్రభావంవల్ల కమ్యూనిజంలో మార్పులు వస్తున్నాయని ఉత్తర ప్రదేశ్‌లోని జిల్లా, నగర కాంగ్రెసు సంఘాల అధ్యక్ష, కార్యదర్శుల సమావేశంలో మాట్లాడుతూ కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ ఢేబర్ అన్నారు. ఈ మధ్య మాస్కో టుంగ్ చేసిన ప్రకటనను, రష్యాలోని మార్పులను ప్రస్తావించి, యీ సంఘటలవల్ల అత్యంత ప్రభావం ఉందన్నారు. రష్యాలోని సంఘటనపై శ్రీ నెహ్రూ ప్రకటనను కూడా ఆయన పేర్కొన్నారు.

### రిట్ దరఖాస్తులకు కోర్టు రుసుం

హైదరాబాదు, జూలై 4: రాజ్యాంగంలోని సూత్రాలు 226, 227 క్రింద దాఖలయ్యే రిట్‌లు, దరఖాస్తులకు రుసుము రెండు రూపాయలనుండి వంద రూపాయలకు పెంచుతూ ప్రభుత్వం హైదరాబాదు కోర్టు రుసుముల చట్టాన్ని సంస్కరించబోతోంది.

ఇటీవల ఒక కేసులో ఆంధ్రప్రదేశ్ ప్రధాన న్యాయస్థానం తెలంగాణా ప్రాంతంనుండి వచ్చే దరఖాస్తులకు హైదరాబాదు కోర్టు రుసుముల చట్టం, ఆంధ్రప్రాంతంనుండి వచ్చే కేసులకు ఆంధ్రా కోర్టు రుసుముల చట్టం వర్తిస్తుందని నిర్ణయించారు. ఈ చట్టాల క్రింద తెలంగాణా ప్రాంతం వారు రెండు రూపాయలు ఆంధ్ర ప్రాంతం వారు వంద రూపాయలు రుసుం చెల్లించవలసివుంది.

## బ్రిటన్‌వద్ద 20 కోట్ల పౌనుల అప్పుకు ప్రయత్నం

### నెహ్రూ వివరణ: మున్ముందు భారత దిగుమతులకు అంతుండదని ప్రకటన

లండన్, జూలై 5: భారతప్రధాని శ్రీ నెహ్రూ నిన్న పత్రికా సమావేశంలో ఒక విలేఖరి ప్రశ్నకు జవాబుగా, భారతదేశానికి 20 కోట్ల పౌనుల పరపతి అవసరం ఉంటుందని చెప్పినదానికీ, లండన్ వ్యాపారవర్గాలద్వారా ఇటీవల ప్రచారమౌతున్న వార్తకూ పరిపోలుతున్నది.

శ్రీ నెహ్రూ నిన్న పత్రికా సమావేశంలో ఇంకా యీ క్రింది అంశాలు వివరించారు:

భారతదేశానికి విదేశీద్రవ్య అవసరాలు ఒకటి రెండేళ్ళపాటు పరపతి రూపంలో తీర్చుకోవలసి ఉంటుంది. ప్రస్తుతం యంత్రాలు, ఆహారసామగ్రి మొదలైన అత్యవసర సామగ్రిమాత్రం దిగుమతి చేసుకుంటారు. మిగతా అన్ని సరుకులు దిగుమతి ప్రస్తుతానికి నిలిపివేశారు.

ఈ యంత్రాల సహాయంతో మున్ముందు విదేశీ ద్రవ్యాన్ని భారతదేశం బాగా ఆర్జించుకోగలుగుతుంది.

అయితే అప్పు అవసరాలను గురించి శ్రీ నెహ్రూ తామై ఎవరితోనూ మాట్లాడలేదని చెప్పారు. అది ఉద్యోగులకు విడిచిపెడుతున్నారు.

దిగుమతులపై ఈ నిర్బంధం తాత్కాలికమే అని శ్రీ నెహ్రూ అన్నారు. ఇది మహా ఉంటే ఏడాది, పద్దెనిమిది మాసాలుండవచ్చు.

భారతదేశం పరిశ్రమలు చక్కగా నిర్మించుకొని, ముప్పైనలభైకోట్ల ప్రజల జీవనప్రమాణం పెరిగినప్పుడు, దిగుమతులకు అంతుండదనే సంగతి గ్రహించండి, అని శ్రీ నెహ్రూ అన్నారు.

### ప్రణాళికాసంఘ సభ్యుల జీతాల తగ్గింపు

న్యూఢిల్లీ, జూలై 4: ప్రణాళికా సంఘ ఉపాధ్యక్షులు శ్రీ వి. టి. కృష్ణమాచారి, ఇద్దరు ఇతర సభ్యులు శ్రీ కె. సి. నియోగి, డా॥ జె. సి. ఘోష్ వారి జీతాలలో 10% తగ్గించుకోవాలని నిర్ణయించుకున్నారు.

### గృహ నిర్మాణానికి బీమాసంస్థ సహాయం

బొంబాయి, జూలై 4: గృహనిర్మాణ పథకాలను కేంద్ర ప్రభుత్వం కాని, రాష్ట్ర ప్రభుత్వాలుకాని రూపొందించినట్లయితే, జీవిత బీమాసంస్థ ధన సహాయం చెయ్యగలదని, ఆసంస్థ అధ్యక్షులు శ్రీ కామత్ చెప్పారు.

## బియ్యం, పిండిమరలకు, వర్తకులకు లైసెన్సులు

### ఆహారధాన్యాల నిల్వలకు వీలు లేకుండా రాష్ట్రాలకు అధికారం

న్యూఢిల్లీ, జూలై 5: బియ్యం, పిండిమరలకు, కొన్ని వర్గాల ధాన్యం వర్తకులకు లైసెన్సుల నిచ్చే విధానాన్ని అవలంబించడానికి రాష్ట్రప్రభుత్వాలకు కేంద్రం అధికారం ఇచ్చినట్లు తెలుస్తోంది. ఈ అధికారాన్ని 1955 అత్యవసర వస్తుసామగ్రి చట్టంప్రకారం ఈ అధికారాన్ని రాష్ట్రప్రభుత్వాలకు ఇచ్చారు.

మిల్లు యజమానులవద్ద, వర్తకులవద్ద ఉండే నిల్వలను గురించిన వివరాలను రాష్ట్ర ప్రభుత్వాలు ఈ అధికారం ప్రకారం కోరవచ్చు. ఆ విధంగా రాష్ట్రంలోని నిల్వలను గురించీ, వాటి పంపిణీ గురించీ తగు జాగ్రత్త చర్యలు తీసికొనే అవకాశం ఉంది. మిల్లులలోను, యజమానులవద్ద ఉండే నిల్వలను తనిఖీ చేయడానికీ, అవసరమైనప్పుడు ఆ నిల్వలను స్వాధీనం చేసికొనడానికి రాష్ట్ర ప్రభుత్వాలకు ఈ శాసనం అధికారం ఇస్తోంది.

### పడవ ప్రమాదంపై నిర్ణయాలు నివేదిక ఒకేసారి ప్రచురిస్తాం

#### ముఖ్యమంత్రి ప్రకటన

హైదరాబాదు, జూలై 15: గోదావరి పడవ ప్రమాదం గూర్చిన విచారణ నివేదికను పరిశీలన పూర్తిఅయిన తరువాత ప్రభుత్వ నిర్ణయాలతో కలిపి ప్రకటిస్తామని ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి తెలియజేశారు.

ఇవాళ శాసనసభలో ప్రశ్నోత్తరాలు అవగానే శ్రీ జి. యల్లమందారెడ్డి (కమ్యూనిస్టు) లేచి రెండువందల మంది చావుకు కారణమైన గోదావరి పడవ ప్రమాదంగూర్చి విచారణ సంఘం నివేదికను సభ్యులకు అందజేయలేదని సభాపతి దృష్టికి తీసుకొని వచ్చారు.

అధికారరీత్యా ఏమీ వెల్లడించకపోవటంవల్ల పత్రికలలో పరస్పర విరుద్ధమైన వార్తలు పడుతున్నాయనీ అందువలన వెంటనే ప్రభుత్వం నివేదికను ప్రచురించాలని శ్రీ యల్లమందారెడ్డి కోరారు.

### 160 మైళ్ళు ఎత్తు పంపిన అమెరికన్ రాకెట్

ఫోర్ట్ చర్చిల్, జూలై 4: ప్రపంచ భౌగోళిక పరిశోధన కార్యక్రమం ప్రకారం అమెరికా ఇక్కడ ఆకాశంలోకి పంపిన రాకెట్ 160 మైళ్ళదూరం వెళ్ళింది.

కరాచీ, జూలై 4: 1957 జూన్ 30 తో అంతమైన ఆర్థిక సంవత్సరంలో అమెరికా పాకిస్తాన్‌కు 17½ కోట్ల డాలర్లకు పైగా సహాయం ఇచ్చింది. ఇందులో 4 కోట్ల 20 లక్షలు ఋణ రూపంలో ఇచ్చిన మొత్తం.

### బ్రిటన్ భారత దేశాల మైత్రి

లండన్, జూలై 5: బ్రిటన్ భారత దేశాలమధ్య సంబంధాలనుగురించి, నిన్న భారత ప్రధాని శ్రీ నెహ్రూ పత్రికా సమావేశానికి ముందు, భారత పత్రికా విలేఖరులతో ప్రత్యేక గోష్ఠిలో వివరించారు.

ప్రపంచంలో ఈనాడు భారతదేశం పట్ల వైమనస్యం కలవారు అనేకులున్నారు. అనేకమంది మిత్రులూ ఉన్నారు.

భారతదేశం మైత్రి చూపుతున్నప్పటికీ స్వతంత్ర విధానాలు అనుసరిస్తున్నందువల్ల గిట్టనివారున్నారు.

భారతదేశం పారిశ్రామికంగా వృద్ధిచెంది, బలంకల రాజ్యంగా రూపొందడం చాలమందికి ఊహించలేని విషయంగా కనపడవచ్చు.

బ్రిటన్‌లో అధికారులలోనూ ఇతరులలోనూ కూడా పురాతనాతత్వం విడిచిపెట్టనివారు కొందరున్నారు. వీరికి భారతదేశం స్వాతంత్ర్యం పొందడం పిడుగుపాటుగా వచ్చింది. ఆ దెబ్బనుంచి వారింకా తేలుకోలేదు.

పోగా, మిత్రులుఅనేకు లున్నారు. బ్రిటన్‌లో సర్వపక్షాలలోనూ, అధికారవర్గంలోనూ, ప్రజలలోనూ, భారతదేశం పట్ల సుహృద్భావంతో ఉన్న వారనేకమంది ఉన్నారు.

గత నూటయాభై ఏళ్ల చరిత్ర ప్రభావాన్ని ఉన్నట్టుండి తుడిచివెయ్యడం కష్టం. ప్రస్తుతం తాము (శ్రీ నెహ్రూ) ఇంగ్లీషులో మాట్లాడ్డం కూడా ఆ ప్రభావ ఫలితమే అన్నారు. అందులో దోషం ఏదైతే ఉందో, అది స్వాతంత్ర్యం లభించడంతో పోయింది.

అయినా బ్రిటన్‌లో కొందరి మనస్సుల్లో ఇంకా దాని తాలూకు దోషం మిగిలి ఉంది. భారతదేశంలో కూడా కొందరి మనస్సుల్లో ఉండవచ్చు. కాని మొత్తం మీద అంతరించిందనే చెప్పాలి.

ఇంగ్లీషు భాష, సాహిత్యం, రాజకీయ సంప్రదాయాలు మొదలైనవి ఆ ప్రభావంవల్ల వచ్చినవి ఎన్నో మిగిలిపోయాయి. అవి మిగిలినందుకు హర్షిస్తున్నారే కాని చింతించడం లేదు, అన్నారు.

పూర్వ సాన్నిహిత్యంవల్ల బ్రిటన్‌తో భారతదేశానికి మైత్రి అధికం కాని ఇతర దేశాలతో కూడా స్నేహం లేకపోలేదు. కామన్వెల్తులో భారత దేశానికి సభ్యత్వం ఉన్నంత మాత్రంలో ఈ వర్గంలోని అన్ని రాజ్యాలతో భారతదేశానికి అంత సాన్నిహిత్యం లేదు. కాని కామన్వెల్తుకు చెందని బర్మా వంటి రాజ్యాలతో మిగతా వానికంటె అతి సన్నిహితమైత్రి ఉంది.

ఒక దేశంతో మైత్రిలో ఉంటే, మరో దేశంతో మైత్రికి వీలుండదనే తత్వం తమకెన్నడూ అర్థంకాదని శ్రీ నెహ్రూ అన్నారు.

# శీతజ్వరం

## తిరుత్తనిలో ఒకరు మరణం

తిరుత్తని, జూలై 4: తిరుత్తనిలోను, తాలూకా గ్రామాలలోను ఈ జ్వరం తీవ్రంగాఉంది. పాఠశాలలను మొదటి తేదీన తెరచారు, రైతులు, కూలీలు జ్వరంతో ఉన్నందువల్ల వ్యవసాయ పనులు వెనుకపడ్డాయి. తిరుత్తనిలో ఒక మరాబు దుకాణంలో పనిచేస్తున్న కార్మికుడొకడు రెండు రోజులు జ్వరంతో బాధపడి, ఉల్లియంబాకం గ్రామానికి వెళ్ళాడు. అక్కడ ఈతడు మరణించాడని తెలిసింది. కనకమ్మసత్రం, తదితర గ్రామాలలోకూడా మరణాలు సంభవించినట్లు తెలిసింది. కాని వివరాలు తెలియవు. తిరుత్తనిలో పంచాయితీ ఆరోగ్య శాఖాధికారి మందు మాత్రలను పంచిపెట్టారు.

## హైదరాబాదులో ఒక్క రోజులో 2500 మందికి

హైదరాబాదు నగరంలో ఈ రోజు 2500 మందికి పైగా వ్యాధి సోకినట్లు గుర్తించారు. ఆసుపత్రులలో 96 మంది చేరారు. జంట నగరాలలోని కార్యాలయాలలోను, బ్యాంకులలోను పనిచేసే ఉద్యోగులు జ్వరగ్రస్తులు కావడంవల్ల పని గంటలను తగ్గించారు.

## తాడేపల్లిగూడెం

తాడేపల్లిగూడెంలోను, పరిసర గ్రామాలలోను ఈ వ్యాధి ఉధృతంగానే ఉంది. గ్రామాలలో మందులు తగినంతగా లభ్యంకావడం లేదని తెలిసింది.

## మండపేట

మండపేటలో రెండువేలమందికి పైగా రోగులకు గౌతమి జీవకారుణ్య సంఘం ఉచిత వైద్య సహాయం చేస్తోంది. ఇక్కడ జ్వరం ముమ్మరంగానే ఉంది.

## ఖమ్మం మెట్టు

ఇక్కడ 1500 మందికి పైగా జ్వరం సోకింది. పాఠశాలలను 8 వ తేదీవరకూ మూసివేయాలని అధికారుల నిర్ణయించినట్లు తెలిసింది.

## కొవ్వూరు

ఇంతవరకూ ఇక్కడ 67 మందికి జ్వరం వచ్చిందని పంచాయతీబోర్డు అధికారులు తెలిపారు.

## చెరుకుపల్లి

చెరుకుపల్లిలోను, పరిసర గ్రామాలలోను వేలాదిమంది ప్రజలు జ్వరంతో బాధపడుతున్నారు. వ్యాధి, రోజు రోజుకు ఉధృతం పొతోంది.

## హిందూ విశ్వవిద్యాలయం 22 వరకూ మూసివేత

కాశీ హిందూ విశ్వ విద్యాలయ కళాశాల లన్నిటినీ ఈనెల 22 వ తేదీ వరకూ తెరవరాదని నిర్ణయించారు. మొదట్లో ఈనెల 9 వ తెరవాలని అనుకొన్నారు. కాని శీతజ్వరం ఎంతో ఉధృతంగా ఉన్నందువల్ల కళాశాలలను తెరువవద్దని రాష్ట్ర ఆరోగ్యశాఖ డైరెక్టరు కోరారు. కళాశాలలలో చేర్చుకోవడం మాత్రం యథావిధిగానే ఉంటుంది. నగరంలో సుమారు 15 వేలమందికి జ్వరం సోకిందని వైద్యులు అంచనా వేస్తున్నారు. ఇంతవరకూ మొత్తం 12 మంది చనిపోయారు.

## కలరావల్ల 10 మంది మరణం

ఇది ఇలా ఉండగా కాశీలో కలరా కూడా జోరుగాఉంది. ఇందువల్ల గతవారం రోజులలోను పదిమంది చనిపోయారు. వివిధ ఆసుపత్రులను రాష్ట్ర ఆరోగ్య శాఖామంత్రి ఠాకుర్ సింగ్ పరిశీలించి, వ్యాధినివారణకు తగు చర్యలు తీసికోమని ఆదేశించారు.

## హాలండ్ నగరాలకు శీతజ్వరం వ్యాప్తి

ఇండోనీషియానుండి వచ్చిన ఒక ప్రయాణీకుల నౌకవల్ల హాలండులో శీతజ్వరం వ్యాపించింది; ఇక్కడి అనేక నగరాలలో ఈ జ్వరం వ్యాప్తిచెందింది. ఆసియా దేశాలలోని శీతజ్వరం హాలండ్ ప్రజలకు ప్రమాదకరమైనదని లీడెన్ విద్యాలయానికిచెందిన ఆచార్య జె.మిల్లర్ అన్నారు. ఈ వ్యాధి నివారణకు ఆగస్టు మధ్యలో ప్రత్యేక టీకాల మందు సరఫరా ఔతుందని, కాని ఇది పరిమితంగానే ఉంటుందని ఆయన అన్నారు.

# లోక్‌సభ కార్యాలయ ఖర్చు తగ్గింపు

## హుకుంసింగ్ అధ్యక్షతను పరిశీలక సంఘం ఏర్పాటు

(ఆంధ్ర పత్రిక ప్రతినిధి)

తిరుపతి, జూలై 4: లోక్‌సభ కార్యాలయంలో అన్ని శాఖలలోను అవుతున్న ఖర్చు తగ్గించే విషయం పరిశీలించి తగు సూచనలు చేసే నిమిత్తం ఒక సంఘం ఏర్పాటుచేయమని లోక్‌సభ అధ్యక్షుడు శ్రీ మాడభూషి అనంతశయనం అయ్యంగార్ ఉపాధ్యక్షుడు సర్దార్ హుకుం సింగ్‌ను కోరారు.

సిబ్బంది వేతనాలు భత్యాలకు సంబంధించిన ఖర్చుగురించి కూడా సూచనలు చేయమని శ్రీ అనంతశయనం అయ్యంగార్ కోరారు.

లోక్‌సభ సంయుక్త కార్యదర్శి శ్రీ షాద్‌గర్ శ్రీ హుకుం సింగ్ అధ్యక్షతను ఏర్పడే పరిశీలక సంఘానికి తోడ్పడానికి నియుక్తులు అయ్యారు.

పరిశీలక సంఘం తన నివేదికను ఆగస్టు నెల ఆఖరిలోగా లోక్‌సభ అధ్యక్షునికి సమర్పించవలసి ఉంటుంది.

# ధాన్యం మరల స్థాపనకు అనుమతి

## చిత్తూరు జిల్లా అభివృద్ధి సంఘ సిఫార్సు

చిత్తూరు, జులై 2: ధాన్యం మరల స్థాపనకు అనుమతులివ్వడంలో ప్రభుత్వం విధించిన నిషేధాలు నేటి పరిస్థితులకు అనుగుణంగాలేవని, కనుక అనుమతులు ప్రసాదించి నిర్బంధాలు తొలగించాలని ప్రభుత్వానికి సిఫార్సు చేస్తూ జిల్లా ప్రణాళికా అభివృద్ధి సంఘం గత నెల 29 వ జరిగిన సమావేశంలో తీర్మానించింది. జిల్లాకలెక్టరు శ్రీ పి. వి. రత్నం అధ్యక్షత వహించారు.

భారతసేవక్ మాసపత్రికను జిల్లాలోని అన్ని అభివృద్ధి కేంద్రాల పంచాయతీ జన పాఠశాలలకు శాఖల అధికారులకు, ప్రణాళికా సంఘ సభ్యులకు ప్రభుత్వం ఉచితంగా ఇప్పించాలని సూచించారు.

ఈ రెండు తీర్మానాలను శ్రీ బూదూరు రామానుజులురెడ్డి ప్రవేశపెట్టారు. శ్రీయుతులు ఆర్. బి. రామకృష్ణరాజు, యన్. పి. చెంగల్రాయ నాయుడు. పి. రాజగోపాలనాయుడు, ఆర్. నాదమునిరెడ్డి, జి. రామమూర్తి, పి. గోపాలరెడ్డి, మాట్లాడారు. తరువాత ఏకగ్రీవంగాను ఆమోదించారు.

పాడిపంటలు పత్రికను సంఘ సభ్యులకు ఇప్పించాలని శ్రీ శేషయ్య నాయుడు చేసిన సూచనను ఆమోదించారు.

ద్వితీయ ప్రణాళిక రెండవ సంవత్సరకాలంలో అమలుజరుపదలచిన కార్యక్రమాలను అధ్యక్షులు సమీక్షించారు.

చిత్తూరులో సహకార సంఘాల ఆధ్వర్యాన వంటచెరకు దుకాణాలు ఏర్పాటు చేయాలన్న శ్రీ కె. రామస్వామి అయ్యంగారు ప్రతిపాదనను ఆమోదించారు.

జిల్లాలోని చిన్న తరగతి పరిశ్రమల సరుకుల ప్రదర్శన, విక్రయశాల నొకదానినిచిత్తూరులో నెలకొల్పాలని నిశ్చయించారు. ప్రతి పంచాయతీ రు. 2 చొప్పున దీనికి చందాడీ ఇవ్వాలని కోరారు. ప్రదర్శనశాలకు వసతి చూపాలని జిల్లాబోర్డును కోరారు.

జిల్లాకు సంబంధించిన ద్వితీయ ప్రణాళిక పరిశీలించి 1958-59 లో చేర్చడానికి ఏవయినా క్రొత్త పథకాలుంటే సిఫార్సుచేయమని కోరుతూ ఐదు ఉపసంఘాలను నియమించారు.

## తంతి తపాలా సిబ్బంది కోర్కెలు

మద్రాసు, జూలై 4: తంతి తపాలా శాఖను విస్తృతం చేసే పనులు మొదలు పెట్టటానికి ముందు ఉన్న సిబ్బంది కోర్కెలను సంతృప్తి పరచడం అవసరమని డా॥ వి. కృష్ణస్వామి (యం. పి.) తపాలా ఉద్యోగుల తృతీయ వార్షిక మహాసభ ప్రారంభోత్సవం చేస్తూ చెప్పారు.

దేశంలో ఆర్థిక స్థితి కొంత క్లిష్టంగా ఉన్నంత మాత్రాన తంతితపాలా ఉద్యోగుల స్థితిని బాగు పరచటానికి చర్యలను తీసుకోడం సాధ్యంకాని విషయమని అనరాదు. తపాలాశాఖ సిబ్బంది ఉన్నత పదవులను అధిష్ఠించడానికి తగిన అవకాశము ప్రోత్సాహము యివ్వడం అవసరమని ఆయన అన్నారు.

పోస్టుమాస్టరు జనరలు శ్రీ పి. కె. యస్. చారి తపాలా సిబ్బంది ఉన్నత పదవులను ఆక్రమించటానికి అవకాశాలు లేవని తలచడం తప్పని, ఉద్యోగాభివృద్ధి మార్గాలను గురించి తమ అభిప్రాయాలను పనివారు తమ పత్రికలలో సూచించాలని అన్నారు.

సంఘాధ్యక్షుడు శ్రీ ఆర్. యస్. జగన్నాథరాజ్ సభకు అధ్యక్షత వహించారు. కార్యదర్శి శ్రీ వి. ఆర్. సౌందర రాజన్ స్వాగతం చెప్పారు.

శ్రీ యం. యస్. విశ్వనాథన్, శ్రీ యం. కరుణానిధి కూడా మాట్లాడారు. సహాయ కార్యదర్శి శ్రీ జి. డి. దేశాయి ధన్యవాదాలు సమర్పించారు.

# పశువైద్య కళాశాల తిరుపతికి మార్పు

## తిరుపతిలో సౌకర్యాల పరిశీలన

తిరుపతి, జూలై 3: ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ పశు సంక్షేమశాఖ డైరెక్టరు డాక్టర్ సి. కృష్ణారావు, బాపట్ల పశువైద్యకళాశాల ప్రధానోపన్యాసకులు శ్రీ పి. ఎస్. రాజు నిన్న ఇక్కడికి వచ్చారు. బాపట్లలోని పశువైద్య కళాశాల ఇక్కడికి మార్పుచేసే సందర్భంలో పశువైద్య కళాశాల, క్షీర క్షేత్రము నెలకొల్పడానికిగాను తిరుమల తిరుపతి దేవస్థానంవారు ఇస్తామన్న భవనాలను వారు పరిశీలించారు.

కపిల తీర్థంలో కళాశాల భవన నిర్మాణం చాలవరకు పూర్తి అయినది. దానిలో క్రింది భాగంలో తాత్కాలికంగా పాలీటెక్నిక్ పాఠశాల, మొదటి అంతస్తులో పశువైద్య కళాశాల నెలకొల్పడానికి ఏర్పాటు అయినట్లు తెలుస్తున్నది.

కళాశాల నెలకొల్పడానికి వలసిన అన్ని సౌకర్యాలు కల్పించడానికి, విద్యార్థుల వసతికి తాత్కాలికంగా ప్రతిలో ఒకభాగం ప్రత్యేకించడానికి సంసిద్ధంగా ఉన్నట్లు దేవస్థానం ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు శ్రీ సి. అన్నారావు అధికారులకు తెలియపరచారు.

అధికారులు శ్రీ వెంకటేశ్వర విద్యాలయం రెజిస్ట్రార్ శ్రీ ఎమ్. రామానుజరావును ఈరోజున కలుసుకొన్నారు. విశ్వ విద్యాలయ ఆవరణంలో కొంత స్థలం ఇవ్వగలమని రెజిస్ట్రార్ వారితో చెప్పారు.

డాక్టర్ కృష్ణారావు, శ్రీరాజు కళాశాల భవన నిర్మాణానికి అనుకూలమైన స్థలం ఎన్నుకొనే నిమిత్తం తిరుపతి, తిరుచానూరుల మధ్య ఉన్న ఖాళీ ప్రదేశాలు దర్శించారు.

బాపట్లలో ప్రస్తుతం ఉన్న పశువైద్య కళాశాల అంచెలవారీగా ఇక్కడికి మార్పు చేయడం జరుగుతుందని, 1958 వ సంవత్సరంనుంచి కళాశాల ఇక్కడ పనిచేస్తుందని తెలుస్తున్నది. కళాశాల ప్రధానోపన్యాసకుని కార్యాలయం మాత్రం వెంటనే ఇక్కడికి తరలివస్తుంది. (స్వ. వి.)

# గోదావరిలో పడవ ప్రమాదం

## అహమ్మద్ నగరంవద్ద 20 మంది మృతి

అహమ్మద్ నగరం, జూలై 4: ఇక్కడికి 50 మైళ్ళ దూరంలో పైథాన్‌వద్ద గోదావరిలో ఒక పడవ తలక్రిందులై సుమారు 20 మంది మునిగిపోయారని ఇక్కడికి అందిన వార్తలవల్ల తెలుస్తున్నది. ఇందులో 30 మంది ప్రయాణం చేస్తున్నారు.

ఈసమయంలో గోదావరి వరదలతో ఉధృతంగా ప్రవహిస్తున్నది. ఈ పడవ 2 ఎడ్ల బండ్లను కూడా లాగుతున్నదట.

దాదాపు 10 మంది మాత్రం యీదుకుంటూ ఒడ్డుచేరారు.

## కోయల్ నదిలో పడవ మునిగి 50 మంది మృతి

డాల్టన్‌గంజ్ (బీహార్), జూలై 4: కోయల్ నదిలో షాపూర్ నుంచి, డాల్టన్‌గంజ్‌కి ప్రయాణం చేస్తున్న ఒక నాటుపడవ ప్రవాహం మధ్యలో మునిగిపోయిన కారణంగా దాదాపు 50 మంది వరకూ మరణించి ఉంటారని భావిస్తున్నారు. ఇందులో సుమారు 70 మంది ప్రయాణికులు ఉన్నారని తెలుస్తున్నది.

రోజుల్లా వర్షం కురుస్తున్న కారణంగా నదికి వరదలు తగిలాయి.

పోలీసులు సహాయచర్యలు కొనసాగిస్తున్నారు.

ఈపడవకు చిల్లిపడటంవల్ల ఆరంభం నుంచీ లోపలకు నీరు ప్రవేశిస్తునే ఉన్నదని, గట్టుకు యీదుకొని వచ్చిన ఒక ఉపాధ్యాయుడు తెలియజేశారు.

## మదరాసు వార్తలు

మదరాసు, జూలై 4: 1957 మే నెలలో ప్రభుత్వకేంద్రాలలో తయారైన రు 4,77,621 ల విలువగల ఖద్దరు వివిధ ఏజన్సీలద్వారా అమ్మడయింది.

* * *

ప్రభుత్వశాఖలకు సలహా ఇచ్చేందుకు శాసనసభ సంఘాలను నియమించాలనే సూచనను మంత్రివర్గం నిరాకరించింది. అటువంటివానివలన ప్రయోజనం లేదని ఆర్థిక మంత్రి శ్రీ సి. సుబ్రహ్మణ్యం నిన్న శాసనసభలో చెప్పారు.

* * *

శ్రీ ప్రకాశం, డాక్టరు అలగప్పచెట్టియార్ మరణానికి సంతాపం తెలుపటానికి మదరాసు మరీన్ ఈనెల 11 వ తేదీన ఏర్పాటుచేసిన పౌరసభరద్దుఅయినట్లు మరీన్ కార్యాలయం ప్రకటించింది.

* * *

మైలాపూర్‌లోని శ్రీ మధ్వ పెరుమాళ్ దేవస్థానంవద్ద 8 వ తేదీనుండి పది రోజుల ఉదయం 8-30 నుండి సాయంత్రం 7-30 వరకు అమృతవల్లి (తాయార్) కు కోటి కుంకుమార్చన జరుగుతుంది.

క్రీడా రంగం:

# స్త్రీల సింగిల్స్ ఫైనల్‌లో గిబ్సన్, హార్డ్‌లకు పోటీ

## వింబుల్‌డన్ టెన్నిస్ సెమిఫైనల్ ఫలితాలు

లండన్, జూలై 4: వింబుల్‌డన్ లాన్ టెన్నిస్ ఛాంపియన్‌షిప్సు స్త్రీల సింగిల్సు ఫైనల్‌లో కుమారి ఆల్తీ గిబ్సన్, కుమారి డార్లెన్ హార్డ్‌కు పోటీ జరుగుతుంది. ఈఛాంపియన్‌షిప్సు చరిత్రలో ఫైనల్‌లో ప్రవేశించిన మొదటి నీగ్రోబాలిక కుమారి గిబ్సన్.

సెమిఫైనల్‌లో కుమారిగిబ్సన్(అమెరికా) 6-1, 6-1 స్కోరుతో కుమారి క్రిస్టినిట్రూమన్ (బ్రిటన్)ను ఓడించినది. రెండవ సెమిఫైనల్‌లో కుమారి డార్లిన్‌హార్డ్ (అమెరికా) 6-2, 6-3 స్కోరులో శ్రీమతి వరోతీనోడ అమెరికా)ను ఓడించినది. ఫైనల్ పోటీ శనివారంనాడు జరుగుతుంది.

స్త్రీల డబుల్సు సెమిఫైనల్‌లో శ్రీమతి కె. హాకెన్, శ్రీమతి టి. డి. లాంగ్ (ఆస్ట్రేలియా) 7-5, 6-2 స్కోరుతో కుమారి వై. రామిరెజ్, కుమారి ఆర్. యమ్. రీస్ (మెక్సికో)లను ఓడించారు.

పురుషుల డబుల్సు సెమిఫైనల్‌లో ఎస్. వి. ఫ్రైజర్, ఎల్. ఎ. హోడ్ (ఆస్ట్రేలియా) 14-12, 1-6, 8-6, 6-3 స్కోరుతో ఎన్. పరీశాంజలి, ఓ. సిరోలా (ఇటలీ) లను ఓడించారు.

## క్వార్టర్ ఫైనల్స్

పురుషుల డబుల్సు క్వార్టర్ ఫైనల్‌లో ఆర్. బెక్కర్ (బ్రిటన్), ఆర్. ఎన్. హావ్ (ఆస్ట్రేలియా) 6-4, 3-6, 7-5, 3-6, 7-5 స్కోరుతో డి. క్యాండీ, ఎమ్. జి. రోజ్ (ఆస్ట్రేలియా)లను ఓడించారు.

స్త్రీల డబుల్సు క్వార్టర్ ఫైనల్‌లో కుమారి ఎస్. రేనాల్డ్సు, కుమారి ఆర్ స్క్వార్మన్ (దక్షిణాఫ్రికా) 6-3, 6-2 స్కోరుతో కుమారి వి. పూజెకోవా (చెకొస్లోవాకియా), శ్రీమతి ఇ. వోల్మర్ (జర్మనీ) లను ఓడించారు.

మిక్స్‌డ్ డబుల్సు క్వార్టర్ ఫైనల్‌లో ఆర్. ఎమర్సన్, కుమారి హెచ్. హెల్యర్ (ఆస్ట్రేలియా) 6-1, 6-3 స్కోరుతో కె. కామో (జపాన్), కుమారి ఆర్. బ్యూయర్ (బెర్మూడా) లను ఓడించారు. మరొక క్వార్టర్ ఫైనల్ పోటీలో ఎమ్. జి. రోజ్ (ఆస్ట్రేలియా), కుమారి డి. ఆర్ హార్డ్ (సంయుక్త రాష్ట్రాలు) 6-3, 6-0 స్కోరుతో ఎస్. ఫ్యారర్ట్, కుమారి ఎమ్. ఆర్నాల్డ్ (సంయుక్తరాష్ట్రాలు) లను ఓడించారు.

శ్రీ ఒ. ఆర్. కె. రావు తెలియపరచుచున్నారు. ఈ ఏడాది క్లబ్ కార్యనిర్వాహక వర్గానికి ఈక్రిందసూచించిన వారు ఎన్నికైనారు. కెప్టెన్ పి. డి. శాస్త్రిన్- అధ్యక్షుడు. శ్రీ బి. పి. జె. కొప్పలరావు - ఉపాధ్యక్షుడు. శ్రీ ఒ. ఆర్. కె. రావు - ప్రధాన కార్యదర్శి. శ్రీ కె. ఎస్. రాజు - కోశాధికారి. శ్రీ ఆర్. జె. శామ్యూల్, శ్రీ జి.భాస్కర్ శ్రీ ఎ. ఎన్. ఎన్ మూర్తి. శ్రీ ఎ. కె. రావు - వివిధశాఖల కార్యదర్శులు. శ్రీయుతులు వి. వి. ఎస్ రామారావు, జి. ఎస్. ప్రభుదాస్. ఎమ్. వి. ఎల్. ప్రసాదరావు, ఎమ్. వి. ఆర్. మూర్తి సభ్యులు.

# మూడవ టెస్టు

## ఇంగ్లండ్ 2 వికెట్లకు 360 పరుగులు

నాటింగ్ హామ్, జూలై 4: ఇక్కడి ట్రెంట్‌బ్రిడ్జి మైదానంలో ఇంగ్లండుకు, వెస్ట్ఇండీస్‌కు మూడవ క్రికెట్ టెస్ట్ పోటీ నేటి ఉదయం ప్రారంభమైనది. ఇంగ్లండ్ 'టాస్' గెలుపొంది మొదట బాటింగ్ ప్రారంభించి, సాయంకాలం ఆట ముగిసే సమయానికి 2 వికెట్ల నష్టానికి 360 పరుగులు చేశారు.

ఇంగ్లండ్ తరఫున టి. డబ్లియు. గ్రావెనే 188 పరుగులు (నాట్ అవుట్) చేశారు. గ్రావెనే ఓపెనింగ్ బాట్స్‌మన్ పి. ఇ. రిఛర్డ్ సన్‌తో కలసి రెండవ వికెట్‌కు 266 పరుగులుచేశారు. రిఛర్డ్ సన్ 126 పరుగులకు, డి. వి. స్మిత్ ఒక పరుగుకు అవుటు అయ్యారు. గ్రావెనే, పి. బి. హెచ్. మే (40 పరుగులు) ఇంకాబాట్ చేస్తున్నారు.

వెస్ట్ ఇండీస్ బౌలర్లలో వొరెల్, అట్కిన్సన్ చెరొక వికెట్ తీసుకొన్నారు.

## వినుకొండ క్లబ్ కార్యవర్గం ఎన్నిక

వినుకొండ, జూలై 4: వినుకొండ పబ్లిక్ వర్క్సు శాఖ ఆఫీసర్సు క్లబ్ సర్వసభ్య సమావేశం క్రిందటి శనివారం శ్రీ బి. సత్యనారాయణ అధ్యక్షతను జరిగినది. ఈ దిగువనూచించిన వారు ఈ ఏడాది క్లబ్ కార్య నిర్వాహక వర్గానికి ఎన్నికైనారు. శ్రీ బి. సత్యనారాయణ- అధ్యక్షుడు. శ్రీ ఎమ్.బి.కె. బిహెచ్. సత్యనారాయణ మూర్తి - ఉపాధ్యక్షుడు. శ్రీ ఎస్. వి. ఎస్. శాస్త్రి కార్యదర్శి. శ్రీ ఆర్. వి. ఎస్. సోమయాజులు-సహాయ కార్యదర్శి, కోశాధికారి శ్రీయుతులు బి హెచ్. సూర్యనారాయణరాజు. పి. కృష్ణమూర్తి, పి. సుబ్రహ్మణ్యం, కె. సత్యనారాయణ మూర్తి, పి. వెంకటరంగం, పి. మాధవరావు - సభ్యులు.

## కిడర్‌పూర్ ఆంధ్రక్లబ్

కలకత్తా, జూలై 4: కిడర్‌పూర్‌లోని ఆంధ్రక్లబ్ కార్యాలయం తాత్కాలికంగా రామనాథ్ పాల్ రోడ్, అయిదవనంబరు గృహానికి (కిడర్‌పూర్) మార్చినట్లు కార్యదర్శి

# ఆకాశవాణి

ఆదివారం, జులై 7

హైదరాబాద్
(411 మీటర్లు)

ఉ॥ 6-50 సుప్రభాత్, 7 తె. వా. 7-15 కర్ణాటక సంగీతం, 7-30 గీతావళి 7-45 క. వా. 8 ఆం. వా. 8-15 హిం. వా. 8-30 హిందూస్థానీ సంగీతపాఠం, 8-45 ఘజల్, 9 పిల్లల కార్యక్రమం (ఉర్దూ), 9-45 వినోద కార్యక్రమం 10-15 విరామ సంగీతం, 10 20 కర్ణాటక సంగీతం, 11 వి. వి. పాటన్‌కర్.

మ॥ 12-30 ఫిల్మీగానే, 12-50 మ. వా. 1-45 నాదస్వరం, 1-50 తె. వా. 2 విద్యార్థుల విశేష కార్యక్రమం, 2-15 బాల వినోదం.

సా॥ 5.30 ఘజల్, 5-45 తబ్లా, 6 స్థానిక ప్రకటనలు, 6-05 ప్రాంతీయ వార్తలు, 6-15 గ్రామసీమ, 7 తె. వా 7-15 గ్రామసీమ, 7-30 వి. వి. పాటన్‌కర్, 8-30 ఢిల్లీనుంచి రిలే, 8-45 వీణ, 9 ఆం. వా. 9-15 ఉ. వా. 9-30 రసమయి, 9-45 గీతావళి, 10 టి. జి. పద్మనాభన్, 10-30 ప్రసార సమాప్తి.

విజయవాడ
(357.1 మీటర్లు)

ఉ॥ 6-0 శుభోదయం, 6-30 ప్రసార విశేషాలు, 6-40 భక్తిరంజని, 7. తె. వా., 7-15 కె. వి. నారాయణ స్వామి, 7-45 సంగీత శిక్షణ, 8. ఆం. వా., 8-15 హిం. వా., 8-30 సుప్రభాతమ్ (సంస్కృత కార్యక్రమం.)

మ॥ 1. ఆకాశవాణి వాద్యగోష్ఠి (మద్రాసు నుంచి రిలే), 1-30 గానసుధ, 1-40 హిం. వా., 1-50 తె.వా. 2. సుగమ్ సంగీత్, 2-15 బాలవినోదం (హైదరాబాదు నుంచి రిలే),

సా॥ 5.30 కె. సీతారామయ్య, 6. స్థానిక ప్రకటనలు, 6-05 ప్రాంతీయ వార్తలు, 6-15 గ్రామసుల కార్యక్రమం, 7. తె. వా., 7-15 గ్రామసుల కార్యక్రమం, 7-30గీతావళి,7-45 శ్రోతల ఉత్తరాలకు జవాబులు, 8. కె. సీతారామయ్య, 8-30 ఢిల్లీనుంచి రిలే, 8-45 ఫిల్మ్‌గీతాలు, 9. ఆం. వా., 9-15గీతావళి, 9-30రసమయి(హైదరాబాదు నుంచి రిలే), 9-45 గానసుధ, 10. కె.ప్రకాశ్ రావు, 10-30 ప్రసార సమాప్తి.

మద్రాస్ (ఎ)
(819.1 మీటర్లు)

ఉ॥ 6-50 స్వాగతం 6-55 కార్యక్రమ వివరణ 7 వాద్య సమ్మేళనం 7-30 పి. ఎస్. రామమూర్తి.

మ॥ 1 ఆకాశవాణి వాద్యగోష్ఠి 1-30 గీతమంజరి 1-40 హిం. వా. 12-50 గీతమాలిక 2 త. వా. 2-10 సుగమ్ సంగీత్ 2-30 భక్తి గీతావళి (తిరుచ్చినుంచిరిలే) 3. ఎం. కల్యాణం.

సా॥ 5 పాశ్చాత్య సంగీతం 5-30 మర్ల సూర్యనారాయణమూర్తి 6-05 ప్రాంతీయవార్తలు 6-15 సాయం సంగీతం 7-15 త. వా. 7-30 కథాకాలక్షేపం (తమిళం) 8-30 చిత్తూరు వి. సుబ్రహ్మణ్యం 9. ఎ. ఆర్. కణ్ణన్ 9-30 పాశ్చాత్య సంగీతం, 10-30 ప్రసారసమాప్తి.

మద్రాస్ (బి)
(211. 3, 41. 32 మీటర్లు)

ఉ॥ 6-50 (ఎ) వలె 7 తెనుగు వా 7-15 పాపాపులర్ 8-15 మలయాళ కార్యక్రమం 8-30 సుప్రభాతం సంస్కృత కార్యక్రమం 8-45 కన్నడ నాటిక.

(211.3, 61.28 మీటర్లు)

మ॥ 1. (ఎ) వలె 1-30 ఆంగ్ల వా. 1-40 గీతి కాపోరం 1-50 తెనుగు వా 2 వేణువు2-15 బాలవినోదం(హైదరాబాదు నుంచి రిలే) 3 (ఎ) వలె.

(211. 3, 49.30 మీటర్లు)

సా 5 (ఎ) వలె 5-50 స్థానిక ప్రకటనలు 6 ఆంగ్ల వా 6-5 ప్రాంతీయ వా 6-15 గ్రామస్థుల కార్యక్రమం 7 తెనుగు వా. 7-15 గ్రామస్థులకార్యక్రమం 7-30 నమదు తి పాల్ పెట్టి (తమిళం) 7-45 కె. జానకి 8-30 (ఢిల్లీ నుంచి రిలే) 8-45 (ఎ) వలె. 9 ఆంగ్ల వా 9-15 ఆంగ్ల కార్యక్రమం 9-30 రసమయి (విజయవాడ నుంచి రిలే) 9-45 శ్రీరంగం ఆర్. రంగనాథన్ 10-30 ప్రసార సమాప్తి.

## పురపాలకసంఘ సిబ్బందికి కరవు భత్యం హెచ్చింపు

పెద్దాపురం, జూలై 1: స్థానిక పురపాలక సంఘం జూన్ 29 వ తేదిని సమావేశమై పురపాలక సంఘ సిబ్బందికి అదనంగా ఆరు రూపాయలు కరవు భత్యం ఇవ్వడానికి తీర్మానించినది. ఇందుకుగాను సాలుకు అదనంగా 12 వేల రూపాయలు ఖర్చు అవుతుంది. ఈ మొత్తం గ్రాంటుగా మంజూరు చేయమని రాష్ట్ర ప్రభుత్వాన్ని కోరడానికి కూడా పురపాలక సంఘం తీర్మానించినది. పురపాలక సంఘ సమావేశానికి శ్రీ ముప్పన రామారావు అధ్యక్షత వహించారు.

పట్టణంలో శీతజ్వరం వ్యాపించిన కారణంచేత అదనంగా ఒక శానిటరీ ఇన్‌స్పెక్టరును ఒక నెలవరకు నియమించడానికి పురపాలక సంఘం నిశ్చయించినది.

1956-57 వ సంవత్సరంలో ప్రభుత్వం 40,000 రూపాయలు పురపాలక సంఘానికి ఋణం ఇచ్చినది. ఆ మొత్తాన్ని రెండు సంవత్సరాలలో కాని నాలుగువాయిదాలలో కానితీర్చడానికి అనుమతించమని ప్రభుత్వాన్ని అభ్యర్థిస్తూ పురపాలకసంఘం తీర్మానించినది. (స్వ. వి.)

# మదరాసు ధరలు

మదరాసు, జూలై 5:

బంగారు వెండి నేటి మధ్యాహ్నం 1 గంటకు సవరను 1-కి ఎడ్వర్డుబొమ్మ సేల్సుటాక్సుతో సహా రు. 70.75
పేట్లబంగారం తులం రు. 106.87
మూసా బంగారం తులం రు. 105.00
సీమవెండి తులం 100 కి రెడి 188.00
చిల్లర ధర రు. 1.87

### వేరుశనగ

(551 పౌ॥ 1-కి ఎక్స్‌పోర్టు కిడ్డంగులు మెషిన్ సేల్సుటాక్సుతో సహా
డిసెంబరు రు. 166-½ 0
వేరుశనగనూనె ఎక్స్‌పెల్లర్ బిలో % పౌ.) రెడి చిల్లర ధర 835.00
(ఎక్స్‌పెల్లర్ కి.రు. 25, సేల్సుటాక్సు, ఎక్స్‌సైజ్ సుంకంతో సహా)
50 టెంకాయనూనె (87½ పౌనులు సేల్సుటాక్సు అదనం,
అంబుమార్కు రు. 81.00
ఎం. ఎస్. (బ్రాండ్ డబ్బా 81.50
రాజా రు. 31.25

### ఆముదం

తిరుపత్తూరు (500 పౌ.) రు. 340.00

### పంచదార

సేలం లోటస్ క్యాన్ (87½ పౌ) 28.00
అనకాపల్లి (226 పౌ.) 109.71
కామ్రాజు (229 పౌ.) 110.79
నెల్లికుప్పం (4 అండర్) 100.21

# ఆదోని మార్కెట్

ఆదోని, జూలై 1: గత నెల 29 తేదీతో అంతమైనవారానికి ప్రత్తి, వేరుశనగ, ధర లిక్కడ ఇలా వున్నవి:

ప్రత్తి (పౌ 392)
ముంగారి: రు 130-0-0 రు 185-0-0
ఫారం: రు 130-0-0 రు 141-0-0
లక్ష్మి: రు 160-0-0 రు 175-0-0

దూది (పౌ 392)
ముంగారి: రు 315-0-0 —
ఫారం: రు 375-0-0 రు 390-0-0
లక్ష్మి: రు 345-0-0 రు 410-0-0

ప్రత్తి గింజలు (రూ 1 కి)
ముంగారి: — —
ఫారం: 7¾ పౌ —
లక్ష్మి: 10½ పౌ —

వేరుశనగ కాయలు
(మణుగు-28 పౌ)
సుంద్రవిని రు 6-12-6 రు 6-14-0
కోరమాండల్ రు 6-11-6 రు 6-13-0
వేరుశనగగింజలు పుట్టి (581 పౌ) రు 164-0-0 రు 167-0-0

# కొబ్బరికాయ మార్కెటు

రాజమండ్రి, జూలై 3: తూర్పుగోదావరిజిల్లా కొబ్బరికాయ మార్కెట్టులో జూన్‌నెల 29 వ తేదీతో సమాప్తమైనవారంలో జరిగిన వ్యాపారం ఇలా ఉన్నది:

| కేంద్రము | చేరినసరుకు | ఎగుమతైనసరుకు | గంజేర | గటాగట | చిట్టకాయ | నీటికాయ |
|---|---|---|---|---|---|---|
| అమలాపురం | 276220 | 276220 | 200/- | 190/- | 170/- | 130/- |
| అంబాజీపేట | 38340 | 36340 | | | | |
| తాటిపాక | 183000 | 129000 | — | — | — | 115/- |
| శెట్టిపాలెం | 89000 | 58000 | | | | |
| రాజమండ్రి | 286000 | 23160 | — | — | — | — |
| కాకినాడ | 508980 | 503980 | — | — | — | 130/ |
| | 13,24,540 | 10,26,600 | | | | |

500 కాయల పుట్టి 1 కి రు 271.25 లు చొప్పున 46,740 పౌన్లు ఎండుకొబ్బరి అంబాజీపేట కేంద్రమునుంచి ఎగుమతి జరిగినట్లు, తూ. గో. జిల్లామార్కెటు కమిటీవల్ల తెలియుచున్నది. (స్వ. వి.)

# ఆంధ్రవిశ్వ విద్యాలయం

## బి. ఎ. (ఆనర్సు) పరీక్షా ఫలితాలు

వాల్తేరు, జూలై 4: ఆంధ్రవిశ్వ విద్యాలయం ఆధ్వర్యాన ఈ సంవత్సరం (1957) మార్చి-ఏప్రిల్ మాసాలలో జరిగిన బి. ఎ. (ఆనర్సు) గణితం పరీక్షలలో దిగువ నెంబర్ల విద్యార్థులు కృతార్థులయ్యారని రిజిస్ట్రార్ ప్రకటించారు.

ద్వితీయ విభాగం-
I వ బ్రాంచి-గణితం
ప్రథమశ్రేణి: 173 174 176 180 182 185.
ద్వితీయశ్రేణి: 175 179 187 191.
తృతీయశ్రేణి: 181 మాత్రమే.
178 183 184 186 189 190 నెంబర్ల విద్యార్థుల పరీక్షా ఫలితాలు తరువాత ప్రకటిస్తారు.

# గంటల పంచాంగం

శ్రీ హేమలంబ సం॥ఆషాఢ శు॥ దశమి 1957 సం॥ జూలై 6 శనివారం శు॥ దశమి రా 2-34 స్వాతి 24-20 వర్జ్యం 6-6 ల 7-41 కు.

శు॥ ఏకాదశి జూలై 7 ఆదివారం శు॥ ఏకాదశి రా 2-6 విశా .24-34 వర్జ్యం 5-59 ల 7-36 కు వర్జ్యం రా 4-41 ల.

ఆంధ్రపత్రిక

ఒకరే యిది యొనరించిన
వశజర ఉత్రియుదు శల మనంబున కగు దా
కౌతుంకు జరిసేయకునికి
వరాయుణము నరమదర్కు వధమునాల్లన్
(మహాభారతము)

హేమలంబ సం॥ ఆషాఢ శు॥ దశమి
శనివారం

## రష్యాలో మార్పులు

నేడు 'రాజు,' రేపు 'రాజ' ద్రోహి. నిన్న ప్రజా నాయకుడు, నేడు ప్రజా ద్రోహి. ఈ క్షణంవరకూ విప్లవ నాయకుడు. ఉత్తరక్షణంనుంచీ విద్రోహుల ముఠానాయకుడు. వ్యక్తులు ఈవిధంగా మారిపోవడానికి కారణాలు తెలియవు. ఈ మార్పులుమాత్రం సోవియట్ రష్యాలో తరచు జరుగుతూ వున్నవి. స్టాలిన్ హయాంలో జరిగినట్లు, నేరారోపణలు, విచారణలు, మరణశిక్షలు యిప్పుడు జరక్కపోయినా ప్రముఖ నాయకులు తరచు పదభ్రష్టులవుతూ వున్నారు. ప్రభుత్వ విధానాల్లో వస్తున్న మార్పులవల్ల యీ మార్పులు తప్పనిసరి అవుతున్నవని చెప్పడానికి వీల్లేదు. మాలొటోవ్, మాలెంకొవ్, కగనోవిచ్, షెపిలోవ్‌ల బర్తరఫ్‌లపై వ్యాఖ్యానిస్తూ మికొయన్ ప్రభుత్వవిధానం పూర్వం వున్నట్లేవుంటుందని, మార్పులు ఏమీ లేవనీ స్పష్టం చేశారు. ఈ నలుగురి బర్తరఫ్‌కు కారణాలను అధికార ప్రకటన వివరించింది. ప్రభుత్వ విధానాలను మార్చడానికి వీరు ప్రయత్నించారని, విధానాలు సక్రమంగా అమలుజరగడానికి వీలు లేకుండా వీరు అవరోధాలు కల్పిస్తూ వచ్చారని అధికార ప్రకటన ఆరోపించింది.

మంత్రుల రాజీనామాలు, బర్తరఫ్‌లు కమ్యూనిస్టు రాజ్యాల్లో నేగాక, ప్రజాస్వామిక దేశాల్లోనూ జరుగుతూ వుంటవి. అయితే ప్రభుత్వ విధానాలతో ఏకీభవించని మంత్రులు స్వయంగానే వారి పదవులకు రాజీనామా ఇవ్వడం, రాజీనామా కారణాలను వారే స్వయంగా వివరించడం ప్రజాస్వామిక రాజ్యాల్లో మామూలుగా జరుగుతూవుంటుంది. సామాన్యంగా మంత్రులను బర్తరఫ్ చేయవలసిన పరిస్థితి ఏర్పడదు.

సోవియట్ కమ్యూనిస్టు పార్టీపై పూర్తి అధికారం కలిగి వున్న కృశ్చేవ్ పదవిలోగాని, హోదాలోగాని మార్పు ఏమీ లేదు. అనుక్షణం అధికారంలో వున్న వారి ప్రవర్తనను వెయ్యి కళ్ళతో కమ్యూనిస్టుపార్టీ పరిశీలిస్తూవుండగా, పదవుల్లో వున్నవారికి విధానాలను విఘ్న యిుంచడానికిగాని, నిర్ణయమైన విధానాలు అమలు చేయడానికి గాని స్వాతంత్ర్యం లేదు. ప్రపంచశాంతి సాధనకు, వివిధ రాజ్యాలతో స్నేహసంబంధాలను ఏర్పాటు చేసుకొనడానికి ప్రపంచ పరిస్థితులలో ఏర్పడి వున్న ఉద్రిక్తతను తగ్గించివేయడానికి సోవియట్ ప్రభుత్వం తీసుకుంటున్న చర్యలు ఫలించకుండా నలుగురూ, ముఖ్యంగా మాలొటోవ్ అడ్డుపడినట్లు కూడా ఈ అధికార ప్రకటన వెల్లడించింది.

ఈ ఆరోపణలు నిరాధారమైనా, లేక ఆ ఆరోపణలు యథార్థమైనా ఇందువల్ల ప్రభుత్వమనస్సు, అగ్రనాయకుల వైఖరి, దృక్పథం కొంతవరకు వెల్లడి అవుతున్నది. ఈ దీర్ఘ ప్రకటన ఉద్దేశ్యం కూడా ఇదే అయినట్లు కన్పిస్తున్నది. సోవియట్ రష్యా ప్రపంచశాంతిని, అన్ని దేశాలతో సఖ్యతను, సన్నిహితసంబంధాలను వాంఛిస్తున్నదని, అందుకు ఇప్పటివరకూ జరిగిన కృషి ఫలించక పోవడానికి సంకల్పలోపం గాని, కార్యక్రమంలో దోషం గాని కారణంగాదని, కొందరు నాయకులు పనిగట్టుకొని ప్రతిబంధకాలు కల్పించడం కారణం అని కృశ్చేవ్ బృందం వెల్లడించింది. ఈ మార్పులవల్ల ప్రపంచసమస్యల పరిష్కారం సులభంకాగలదని, ఈ మార్పులు ప్రయోజనాత్మకమైనవని రాజకీయజ్ఞులు అభిప్రాయపడుతున్నారు. అయినా మున్ముందుగాని ఈ మార్పుల అసలుస్వభావం మార్పులకు కారణం స్పష్టం కాదు.

## విశాఖ అభివృద్ధి అయి తీరుతుంది

### రఘురామయ్య విశ్వాసం

విశాఖపట్నం, జూలై 2 : ఒకరి సహాయంకోసం వేచివుండనవసరం లేకుండానే విశాఖపట్నం పారిశ్రామికంగాను ఇతరత్రానుకూడా అభివృద్ధి అయితీరుతుందని, అయితే అంత మాత్రాన ప్రభుత్వం పట్టనట్లు కూర్చుంటుందని అర్థంకాదని, ప్రస్తుత ఆర్థిక స్థితి, అనేక ఇతర విస్తరణ కార్యక్రమాలదృష్ట్యా చేతనైనది చేస్తుందని కేంద్ర ఉపరక్షణమంత్రి శ్రీ కొత్త రఘురామయ్య నిన్న పట్టణ కాంగ్రెసు గాంధీగ్రాం కాంగ్రెసు సంఘాల స్వాగతానికి సమాధానమిస్తూ తమ విశ్వాసం వెల్లడించారు. శ్రీ మిస్సుల సూర్యనారాయణ అధ్యక్షత వహించారు.

శ్రీ యం. వి. కృష్ణారావు స్వాగతమిస్తూ భారీపరిశ్రమలు ఇక్కడ బాగా అభివృద్ధి చెందుతున్నందున పట్టణ విస్తరణ, ప్రజాసౌకర్యాల నిమిత్తం ఒక కేంద్రసంస్థ వుండాలని సూచించారు.

శ్రీ మిస్సుల సూర్యనారాయణ మాట్లాడుతూ డీసెల్ ఇంజన్ల ఫ్యాక్టరీ ఇక్కడ నెలకొల్పే ప్రయత్నాలు చేయాలని కోరారు.

శ్రీ రఘురామయ్య మాట్లాడుతూ ఎవరు సహాయం చేసినా చేయకపోయినా విశాఖ అభివృద్ధి తిప్పదన్నారు. అయితే ప్రభుత్వం తనకు పట్టనట్లు కూర్చోదని ఆర్థికస్థితిదృష్ట్యా చేతనైనది చేస్తుందని చెప్పారు. రక్షణ పరిశ్రమలు అనేకం ఇక్కడ కలవని ఇవి దేశాభివృద్ధికి చాలా అవసరమని అన్నారు. ఉక్కును ముఖ్యంగా మన దేశంలో నే తయారు చేసుకోవడం చాలా అవసరమని ఎల్లప్పుడూ ఇతరులపై ఆధారపడలేమని తెలిపారు. ప్రభుత్వ సిబ్బందిలో అన్ని తరగతులవారు, ప్రజలు, పూర్తిగా సహకరించి దేశాన్ని శక్తివంతంగాను, పారిశ్రామికంగా ముందుకు వచ్చేటు చేయాలని కోరారు. ఓర్పు అవసరమని తెలిపారు.

లోక్ సభలో ఆంధ్ర ప్రతినిధుల సంఖ్య ప్రస్తావిస్తూ మనకు తగిన ప్రాతినిధ్యం కలదని, ప్రజలు కాంగ్రెసునే విశ్వసించాలని విజ్ఞప్తిచేశారు.

తరువాత నౌకాదళ ఆయుధాల కేంద్రం, సందర్శించారు. వెంట కెప్టెన్ ఆర్. యస్. డేవిడ్‌వున్నారు. శ్రీ భటూసనీ స్వాగతమిచ్చారు. శ్రీ బి. యస్. మల్లికార్జునరావు కార్మికుల నిర్మాణపుల సామరస్యానికి శ్రీ భటూసనీ చేస్తున్న కృషిని వివరించారు.

నౌకా కేంద్రంలో శ్రీ రఘురామయ్యకు సత్కారం జరిగింది. స్వ. వి.

## స్థానిక సంస్థల ఉద్యోగులకు అక్కౌంటు పరీక్షలు

కర్నూలు, జూలై 4 : స్థానిక సంస్థలలో పనిచేసే ఉద్యోగులకు తిరిగి ఆక్టోబరు మాసంలో (1957) అక్కౌంటు పరీక్షలు జరుగుతాయనీ, పరీక్షలకు హాజరు కాదలచేవారు అగస్టు 31 వ తేదీలోగా దరఖాస్తులు పంపాలనీ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ పరీక్షల డిప్యూటీ కమీషనర్ ప్రకటించారు.

అభ్యర్థులు నిర్ణీత దరఖాస్తు ఫారాలను ప్రభుత్వ పరీక్షల కమీషనర్ కార్యాలయానికి వ్రాసి తెప్పించుకోవాలి.

## నౌకా కేంద్రం భవనాల నిర్మాణం

### ఉపరక్షణ మంత్రిచే స్థలాల పరిశీలన

విశాఖపట్నం, జూలై 2: నౌకా స్థావరం, కార్యాలయభవనాలు, శాలుర శిక్షణకేంద్రం, నిర్మాణానికి వుద్దేశించిన కొన్ని స్థలాలను కేంద్ర ఉపరక్షణమంత్రి శ్రీ కొత్త రఘురామయ్య నేడు తనిఖీచేశారు. ఈ భవనాల నిర్మాణానికి 250 ఎకరాల ప్రదేశాన్ని రైల్వే శాఖ అధికారులు ఇచ్చివుండలేదు. అందుకని వీటినిర్మాణం ఆలస్యమైనది ఇంతవరకు ఇవన్నీ యుద్ధకాలపు తాత్కాలిక కట్టడాలలో వుంటున్నవి.

కెప్టెన్ ఆర్. యస్. డేవిడ్‌తో కలసి నిర్మాణ స్థలాలను శ్రీ రఘురామయ్య తనిఖీచేశారు. వీటిని సంపాదించవలసి వున్నది.

ఉన్నతస్థాయిలో యీ విషయం చర్చించి పరిష్కరించవచ్చని శ్రీ రఘురామయ్య చెప్పారు.

## రఘురామయ్యకు సత్కారం

శ్రీ రఘురామయ్య గౌరవార్థం నిన్నరాత్రి "నీల్ప్వ" హోటలులో, శ్రీ రామకృష్ణయ్య చౌదరి (మునిసిపల్ కమీషనరు) సత్కారం చేశారు.

ఉదయం విశ్వకళాపరిషత్తు అధ్యక్షులు శ్రీ కృష్ణా సత్కారంచేశారు.

## ఆంధ్రకేసరి కాంస్య విగ్రహ ప్రతిష్ఠ

### రాజమండ్రి పురపాలక సంఘం మంజూరు

రాజమండ్రి, జూలై 2: కీ॥ శే॥ టంగుటూరి ప్రకాశంపంతులు కాంస్య విగ్రహ ప్రతిష్ఠకు రు 10 వేలు విరాళంగా ఇవ్వాలని పురపాలకసంఘం నిన్న సాయంత్రం శ్రీ పోతుల వీరభద్రరావు అధ్యక్షతను సమావేశమై తీర్మానించింది.

తీర్మానాన్ని శ్రీ నప్పా అప్పలస్వామి ప్రతిపాదించగా శ్రీ మంచి రాజు చంద్రశేఖరం బలపరిచారు.

పట్టణాభివృద్ధికి మూడు లాంతర్ల కూడలివద్ద కొన్ని గృహాలను స్వాధీన పరచుకోవాలనే విషయంమీద సమావేశంలో జరిగిన చర్చల్లో కాంగ్రెసు సభ్యుడు శ్రీ ఎం. వి. శాస్త్రి సంఘం చేసిన నిర్ణయాలకు నిరసన తెల్పుతూ తమ సభ్యత్వానికి రాజీనామా సమర్పించారు. (స్వ. వి.)

## నంద్యాల గృహనిర్మాణ సంఘం ఇబ్బందులు

నంద్యాల, జూలై 1: పట్టణసహకార గృహ నిర్మాణ సంఘం నిర్మించిన పేటలోని కొన్ని ఇండ్లకు పురపాలక సంఘం ఇంతవరకు అనుమతి పత్రాలివ్వలేదనీ, పైగా ఈ గృహాలన్నింటిపైనా (సంఘం నిర్మించిన గృహాలన్నింటి పైనా) విశేషంగా పన్ను విధిస్తోందనీ, గృహ నిర్మాణ సంఘం స్థానిక స్వపరిపాలనాశాఖ మంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డికి సమర్పించిన సన్మాన పత్రంలో పేర్కొన్నది.

సభకు శాసనసభ్యుడు శ్రీ అయ్యపురెడ్డి అధ్యక్షత వహించారు.

శ్రీ బ్రహ్మానందరెడ్డి శ్రీయుతులు పి. సి. జేమ్సు (జిల్లా కలెక్టరు), అయ్యపురెడ్డి (శాసన సభ్యుడు), మద్దూరు సుబ్బారెడ్డి (జిల్లా కాంగ్రెసు కార్యదర్శి), ప్రభృతులు వెంటరాగా గృహ నిర్మాణ సంఘం నిర్మించిన పేటకు వచ్చారు.

గృహ నిర్మాణ సంఘం అధ్యక్షుడు శ్రీ నివర్తి వెంకటసుబ్బయ్య, సంఘం డైరెక్టర్లు, పురపాలక సంఘసభ్యులు తదితర ప్రముఖులు మంత్రికీ, ఆయన వెంట వచ్చిన వారికీ స్వాగతం చెప్పారు.

శ్రీ వెంకట సుబ్బయ్య మంత్రికి సన్మానపత్రం సమర్పించారు. గృహ నిర్మాణ సంఘం తయారు చేసిన పథకాన్ని ఐదు సంవత్సరాల క్రితమే పట్టణాభివృద్ధిశాఖ డైరెక్టరు ఆమోదించి శ్రీఘ్రంగా నిర్మాణంలో ఉన్న ఈ పేటను పట్టణంతో కలిపే నిమిత్తం రోడ్డు వేయమని పురపాలక సంఘాన్ని ఆదేశించారనీ, అయినప్పటికీ వారా రోడ్డు వేయించక, దాని నిర్మాణానికి పేటలోని పౌరులను సగం ఖర్చు భరించాలని కోరారనీ సన్మాన పత్రంలో మంత్రికి నివేదించారు. పట్టణంలోని ఇండ్లపై విధిస్తున్న పన్నుల కంటే గృహ నిర్మాణ సంఘం నిర్మించిన గృహాలపై పురపాలక సంఘం అధికపన్నులు విధిస్తోందనీ, మంత్రి యీ విషయంలో జోక్యం కల్పించుకుని పన్నులు ఒకేరకంగా విధించవలసిందిగా పురపాలకులను ఆదేశించాలనీ కోరారు. పేటలో ఒక ఆస్పత్రిని ఏర్పాటు చేయించాలనీ, గృహనిర్మాణ సంఘ సభ్యులు లోగడ చెల్లించిన పన్నుల మొత్తాన్ని పదిసంవత్సరాల పాటు తిరిగి ఇవ్వాలనీ కూడా సన్మానపత్రంలో మనవిచేశారు.

సన్మాన పత్రానికి సమాధానం చెబుతూ శ్రీ బ్రహ్మానందరెడ్డి గృహనిర్మాణ సంఘం ఎదుర్కొంటున్న ఇబ్బందులను సానుభూతితో పరిశీలించగలమని హామీ ఇచ్చారు.

మంత్రికి భారత సేవక సమాజ అనుబంధ సంస్థ మిత్రకళా సమితివారు కూడా సన్మానపత్రం సమర్పించారు.

శ్రీ కె. ఆర్. మోహనరావు వందన సమర్పణం చేశారు.

# "సమాజశ్రేయస్సును సాధించే ఖచ్చితమైన విధానమేమీలేదు"

## ఆంధ్ర బడ్జెట్ పై విమర్శ

హైదరాబాదు, జూలై 5 : 1957-58 వ సంవత్సరం ఆంధ్రప్రదేశ్ బడ్జెట్ పై శాసనసభలో చర్చ ఇవాళ ప్రారంభమైంది. సమాజశ్రేయస్సును సాధించే, ఆర్థికాభ్యున్నతికి వినియోగపడే స్పష్టమైన విధాన మేమీ బడ్జెట్ లో లేదని శాసనసభలో ప్రధాన ప్రతిపక్షాలు కమ్యూనిస్టు, సోషలిస్టుపక్షాల సభ్యులు విమర్శించారు. సాధారణ చర్చ ఇవాళ్టినుంచి మూడు రోజులు జరుగుతుంది.

చర్చను ప్రారంభిస్తూ ప్రతిపక్షనాయకుడు శ్రీ పి. సుందరయ్య ఇట్లా అన్నారు: "బడ్జెట్ ప్రతిపాదనలను శాసనసభ్యులు వాస్తవిక దృష్టితో సరిగ్గాపరిశీలించడం ప్రభుత్వం అభిమతమయితే, ఆయాశాఖల వివరాలను విడివిడిగా సభ్యులకు అందజేసి ఉండవలసింది. లోటును భర్తీచేయడానికిమామూలుగా ఇచ్చే అధిక ప్రాముఖ్యంతో, ప్రభుత్వ ఆయవ్యయాల ఆడిట్ నివేదిక మాదిరిగా ఆర్థిక మంత్రి బడ్జెట్ ప్రసంగం ఉన్నదని అనవలసి వచ్చినందుకు విచార పడుతున్నాను."

"కొత్త పన్నుల ప్రతిపాదనలేమీ ఆర్థిక మంత్రి చెయ్యలేదు కాని, తెలంగాణాలో ప్రస్తుతం అమలులో ఉన్న వినోదప్రదర్శనలపై పన్ను, రిజిస్ట్రేషన్ పన్ను, ఇతర పన్నులను ఆంధ్ర ప్రాంతంలోని స్థాయికి పెంచుతామని మాత్రం ఆయన స్పష్టంగా సూచించారు. ప్రజల ఆర్థిక పరిస్థితులను బాగు చెయ్యడానికి ప్రభుత్వం సంకల్పించిన పటిష్టమైన విధాన మేమీ బడ్జెట్ ప్రసంగంలో లేదు. ప్రస్తుత అవకతవకల పన్నుల విధానాన్ని మార్చేసూచనేమీ ప్రసంగంలో సూచించలేదు."

### ప్రజలకు చెప్పడంఅవసరం

"ప్రజల స్థితిగతులను బాగుచెయ్యడానికి ఎంత డబ్బు ఖర్చు చేస్తున్నది ప్రజలకు చెవితే కొత్త పన్నులు విధించవలసిన అవసరాన్ని వారు బాగా అర్థం చేసుకోగలుగుతారు. అంతేకాక ఇప్పటి ఆదాయాన్ని ఎట్లా ఖర్చు చేస్తున్నారో కూడా ప్రజలకు వివరించాలి. చెల్లిస్తున్న ప్రతిఒక్క రూపాయి సక్రమంగాఖర్చవుతున్నదన్న నమ్మకం ప్రజలకుకలగాలి. పరిపాలనానిర్వహణకేఆదాయంలో ఎక్కువభాగం ఖర్చవుతున్నదన్న ప్రజల అనుమానాన్ని తొలగించేందుకు ప్రభుత్వం ఏమీ చెయ్యలేదు."

"నీటిపారుదల సౌకర్యాలూ, విద్యుచ్ఛక్తి, రవాణా సౌకర్యాలూ, పరిశ్రమలవంటి వాటికి మొత్తం ఆదాయంలో రు. 35 కోట్లు అంటే నూటికి రు. 40 కేటాయించారు. వైద్యశాఖకు నూటికి రు. 4 మాత్రమే కేటాయించారు. ఖర్చుకు తగ్గ ఫలితాలు వచ్చినవని ప్రజలకు వివరించే నివేదిక లేమీ లేవు. ఈ పది సంవత్సరాలలో జరిగినట్టే పని జరిగితే ప్రజలందరూ సుఖపడగల పరిస్థితులను ఇంకా ఎంతకాలానికి సాధించగలమో తెలియటంలేదు."

### గ్రామాలలో నిరుద్యోగం

"గ్రామాలలో నిరుద్యోగం ఎక్కువైంది. వాస్తవమైన వేతనాలు తగ్గినవి. ధరలు ఇంకా పెరిగేధోరణే కనిపిస్తోంది. డెల్టా ప్రాంతాలలో బస్తా రు 20 అమ్మిన ధాన్యం ఇప్పుడు రు. 29అమ్ముతోంది. గ్రామాలలో ఇటువంటి పరిస్థితులను నివారించే కార్యక్రమమేమీ ప్రభుత్వానికి లేదు. ఎన్నో హామీలు ఇచ్చి కూడా భూమి సంస్కరణలను ప్రభుత్వం ఆలస్యం చేస్తున్నది. జూలై నాటికి భూమి సంస్కరణలను బిల్లును సిద్ధం చేస్తానని రెవెన్యూ మంత్రి అన్నారు."

ముఖ్యమంత్రి : జూలైనాటికి బిల్లును శాసనసభకు అందజేస్తామని మేము అనలేదు. భూమి సంస్కరణలకు అప్పటికి ఒకరూపం ఇస్తామని మాత్రమే అన్నాము. అపని చేస్తాము.

శ్రీ సుందరయ్య : ఆ బిల్లు స్వభావ స్వరూపాలను చూడాలని మాకు ఆదుర్దాగా ఉన్నది.

ఆర్థికమంత్రి : దానినిచూచి సుందరయ్యగారు సమ్మోహితులవుతారు.

శ్రీ సుందరయ్య : సమ్మోహితులమే అవుతామో, భయభ్రాంతులమే అవుతామో మరి. భూమిసంస్కరణ సమస్యను చాలా సంఘాలు పరిశీలించినవి. పెద్ద పెద్ద నివేదికలను సమర్పించినవి. కాని, ఇంతవరకూ చెప్పుకోతగ్గ ప్రయోజనం కవులు దారీ చట్టం ఒక్కటి మాత్రమే. ఈ చట్టాన్ని శాసనసభ కిందటి సెప్టెంబరులో ఆమోదించింది. చట్టం నిబంధనలు జనవరిలో తయారయినవి. భూములను కవులుదార్ల చేత భూస్వాములు మామూలుగానే ఖాళీ చేయిస్తున్నారు. భూములకోసం రాజకీయ బాధితులు పెట్టుకున్న దరఖాస్తులను పరిష్కారం చేసేందుకు రెవెన్యూ మంత్రి ప్రత్యేకంగా జిల్లాలలో పర్యటించారు. అంతేకాని, భూములనుంచి కవులుదార్లను, గ్రామాలలో వెళ్ళగొడుతున్న సందర్భాలను నివారించడం అవసరమని ఆయన అనుకోలేదు. ఖమ్మం తదితర తెలంగాణా జిల్లాలలో అమలులోనికి వచ్చిన భూమి సంస్కరణలకు రెవెన్యూ మంత్రి నిమర్శించారే గాని, వాటిని అమలుజరిపేందుకు ఆయన ఎన్నడూ ప్రయత్నించలేదు."

### హరిజనులకు నివేశన స్థలాలు

"గ్రామాలలో హరిజనులకు ఇళ్ళు కట్టించేందుకు చాలా తక్కువ డబ్బు కేటాయించారు. పాఠశాలల్లో హరిజనుల పిల్లలకు మధ్యాహ్న భోజనం పెట్టించేందుకు డబ్బు కేటాయించడం వల్ల కంట్రాక్టర్లు లాభపడే అవకాశం మాత్రమే లభించింది.

### ఉద్యోగుల కరువుభత్యం

మదరాసు ప్రభుత్వం తన ఉద్యోగులకు అదనంగా 12 కరువు భత్యం ఇవ్వగలగా మన ప్రభుత్వం రు 6 మాత్రమే అదనంగా ఇచ్చింది."

"సమంజసమైన వేతనాలు ఇవ్వవలసివదిగా అడిగిన గ్రామాధికారులకు ఉద్యోగాలను వదులుకోని పోవలసినదిగా ప్రభుత్వం చెబుతోంది."

"నిర్బంధ ప్రాథమిక విద్య అమలులో ఉన్న ప్రాంతాలలో ఆయా గ్రామాలలోని పిల్లలందరూ పాఠశాలలకు హాజరయ్యే విషయమై ప్రభుత్వం శ్రద్ధ వహించ లేదు. సాలుగయిదు తరగతుల చదువు రాకుండానే చాలా మంది పిల్లలు పాఠశాలలను వదలి వెళుతున్నారని ప్రభుత్వ నివేదికలే చెబుతున్నవి."

"ప్రభుత్వ వ్యవస్థ ఆనెదొకటి ఉన్నంత కాలమూ ప్రభుత్వ ఖర్చును తగ్గించి డబ్బును పొదుపు చేసే అవకాశమే ఉండదు. పరిపాలనా నిర్వహణకని ఇంత ఎక్కువ డబ్బు ఖర్చుచేస్తూ ప్రజలపై అదనంగా పన్నులు విధించడంన్యాయం కాదు."

"అవసర పరిస్థితులేవైనా వస్తే తన ప్రతినిధి ద్వారా రాష్ట్రపరిపాలనా నిర్వహణను రాష్ట్రపతి స్వాధీనం చేసుకోవచ్చు. అంతేగాని చాలా డబ్బు ఖర్చయ్యే గవర్నర్లు అనవసరం. ఉన్నతోద్యోగుల వేతనాలను తగ్గించాలి, ఎవరికీ నెలకు రు 1 వెయ్యి కంటే ఎక్కువ జీతం రాకుండా చూడాలి."

"పరిహారంగా నిజాం నవాబుకూ, జాగీర్దార్లకూ ఏటేటా చాలా లక్షల రూపాయలు చెల్లిస్తున్నారు. రాష్ట్ర బడ్జెట్‌లో లోటు భర్తీ అయ్యేదాకా ఈ పరిహారం కోసం ఆగవలసినదిగా వాళ్ళకు ఎందుకు అడగరాదూ? సరిగ్గా పన్ను విధించడానికి వీలుగా నిజాం నవాబు మొత్తం ఆస్తి విలువను ఖచ్చితంగా తేల్చే ప్రయత్నమేమీ జరగలేదు.

### వ్యవసాయాదాయాలపై పన్ను

కేంద్రప్రభుత్వం సూచించినట్టు, కేరళ ప్రభుత్వం ఆచరించినట్టు వ్యవసాయ.దాయాలపై అంచలవారీ పద్ధతిలో మన ప్రభుత్వం కూడా పన్నువిధించాలి. రాష్ట్రంలోని మోటారుబస్సు రవాణా పరిశ్రమనూ, రోడ్డురవాణా సౌకర్యాలను ప్రభుత్వం స్వాధీనం చేసుకోవాలి. రాష్ట్రవాణిజ్య సంస్థను ఏర్పాటుచేసే అవకాశాలను గట్టిగా ఆలోచించాలి."

"ప్రస్తుతం అమలులోఉన్న పన్నుల పద్ధతి మారనంతవరకూ ఇటు ప్రభుత్వానికి గానీ, అటు ప్రజలకుగానీ ప్రయోజనమేమీ ఉండబోదు. కేంద్ర ఎక్సయిజు సుంకాల రూపాన మనరాష్ట్రంలో వసూలయ్యే మొత్తంలో మనకు ఇంకా ఎక్కువవాటా ఇవ్వవలసినదిగా కేంద్ర ప్రభుత్వాన్ని అడగాలి."

### పరిపాలనా నిర్వహణ సిబ్బంది మారాలి

శ్రేయోరాజ్యంలో ప్రజల అవసరాలకుతగ్గట్టు పనిచేయ్యాలంటే పరిపాలనా నిర్వహణ వ్యవస్థలో చాలా మార్పులు రావాలని శ్రీ కొండా లక్ష్మణ్ (ఉప సభాపతి) ఇట్లా సూచించారు : "పరిపాలనా నిర్వహణ సిబ్బందిలో చాలా అవినీతి ఉన్నది. నానాటికీ ఈ అవినీతి పెరుగుతున్నదనే సంగతి గమనార్హం. అవినీతి నిర్మూలన కట్టుబాట్లను ఇంకా బాగా అమలుజరపాలి. బడ్జెట్‌లో ఇందుకు కొంతడబ్బు కేటాయించాలి."

### స్పష్టమైన విధానం లేదు

ప్రజల సాంఘిక ఆర్థికాభ్యున్నతికి వినియోగపడే స్పష్టమైన కార్యవిధానమేమీ ప్రభుత్వానికి లేకపోవడమే ప్రస్తుతం ప్రజలూ, ప్రభుత్వమూ పడుతున్న అవస్థలకు ప్రధానకారణమని విజయనగరంనుంచి కొత్తగా ఎన్నికైన సోషలిస్టుపార్టీ సభ్యుడు శ్రీ బి. శ్రీ రామమూర్తి వివరించారు. ఇంకా ఇట్లా అన్నారు : "మన రాష్ట్రంనుంచి ఎగుమతి అయ్యేవాటిలో పొగాకు ప్రధానమైనది. అందువల్ల పొగాకు వాణిజ్యంచేసే రాష్ట్ర వాణిజ్యసంస్థను ప్రభుత్వం ఏర్పాటుచేస్తే ప్రభుత్వానికి ఆదాయం సమకూరడమేకాక రైతులకు గిట్టుబాటుధర లభించే హామీ కూడా ఉంటుంది. గిట్టుబాటుకాని వ్యవసాయాలపై పన్నులు విధించరాదు. రు 10 లలోపు శిస్తును రద్దుచేసేందుకు ప్రకాశం మంత్రిమండలి ప్రయత్నించిన సంగతిని మనం విస్మరించరాదు. ఇప్పుడు ఆ సౌకర్యాన్ని రైతులకు మంజూరుచేస్తే ప్రకాశం పంతులుగారికి, తగిన స్మారకచిహ్నం ఏర్పాటు చేసిన వాళ్ళమవుతాము. అంచలవారీ పద్ధతిలో వ్యవసాయాదాయాలపై పన్ను విధించడం అవసరం."

### రైతులమీదనేనా పన్నులు?

ప్రస్తుతం అమలుజరుగుతున్న అభివృద్ధి పథకాల ఫలితాలను సమాజంలోని వ్యక్తులందరూ అనుభవించబోతూండగా ఒక్క రైతులమీద మాత్రమే పన్నులు విధించడం న్యాయంకాదని శ్రీ పి. రాజగోపాల్ నాయుడు (కాం) విజ్ఞప్తిచేశారు. "గ్రామాలలోని వడ్డీ వ్యాపారస్థులపై పన్ను విధించే అధికారం ప్రభుత్వానికి ఇంతవరకూ లేకపోతే ఇప్పుడు అటువంటి అధికారాన్ని సమకూర్చుకోవాలి. ఒక్క ఆంధ్ర జిల్లాలో గ్రామాలలోని ప్రజల ఋణాలు రు 200 కోట్లదాకా ఉన్నవని" కూడా ఆయన అన్నారు.

### అనవసరఖర్చు తగ్గించాలి

పరిపాలనా నిర్వహణలో అనవసర ఖర్చును తగ్గించవలసినదిగా శ్రీ నరసింహారావు (కాం) సూచించారు: "అభివృద్ధి కార్యక్రమాలు అమలు జరుగుతున్న కేంద్రాలలో ఆయాకేంద్రాలలోని ఉద్యోగులకోసమే దాదాపు 7 లక్షలు ఖర్చు చేస్తున్నారు. అంటే పనులకు మిగిలే డబ్బు చాలా తక్కువన్న మాట. రాష్ట్ర ఆర్థిక పరిస్థితిని చక్కపరిచేందుకు మద్యనిషేధాన్ని రద్దు చేసే సంగతి ఆలోచించవచ్చు" అని కూడా ఆయన అన్నారు.

జాతీయ వికాస కార్యక్రమ కేంద్రాలలో జరిగే అభివృద్ధి పనులకు అయ్యే మొత్తం ఖర్చులో మూడవ వంతును ప్రజలు తమంతట తాము సమకూర్చాలనే నిబంధన ముఖ్యంగా వెనుకబడిన ప్రాంతాలలోని ప్రజలకు చాలా ఇబ్బందిగా ఉన్నదని శ్రీ బొమురికంటి సత్యనారాయణరావు (కాంగ్రెసు) వివరించారు. తెలంగాణాలో విద్యాసౌకర్యాలు ఇంకా బాగా ఎక్కువ చేయవలసిన ప్రాంతాలకు చాలా తక్కువ డబ్బు ఇస్తున్నారు. ఆ ప్రాంతాలలోని పాఠశాలలకు ఇకముందు ప్రభుత్వ సహాయం అసలు రాదేమోనని భయం కూడా కనిపిస్తోంది" అని కూడా శ్రీ సత్యనారాయణరావు అన్నారు.

ప్రచారక ఖర్చులో ఎక్కువ భాగాన్ని ప్రజలు భరిస్తూండగా అందుకు విరుద్ధంగా చెప్పడం అన్యాయమని శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య (స్వతంత్ర) వివరించారు. "డబ్బు లేదని ప్రభుత్వం ఇప్పుడు అంటుంది. పరిపాలనా నిర్వహణలో అనవసర దుబారాను తగ్గించే విషయమై ప్రభుత్వం శ్రద్ధ వహించాలి." అని శ్రీ గోపాలకృష్ణయ్య సూచించారు.

భూమి సంస్కరణను సక్రమంగా అమలు జరపవలసినదిగా శ్రీ జె. కొండలరావు విజ్ఞప్తి చేశారు.

ఖర్చును తగ్గించేందుకు ప్రభుత్వం ప్రయత్నించకుండా కొత్త పన్నులను సూచించవలసినదిగా ప్రతిపక్షాలను అడిగి ప్రయోజనం లేదని శ్రీ పి. నరసింగరావు అన్నారు.

మంత్రుల నియోజకవర్గాలలోనే అభివృద్ధి పథకాలన్నీ అమలుజరుగుతున్నవని శ్రీ బసవామన్నయ్యఆరోపించారు; రాష్ట్రంలోని అన్ని ప్రాంతాల పట్లా న్యాయంగా వ్యవహరించవలసినదిగా ప్రభుత్వానికి విజ్ఞప్తి చేశారు.

## జంటనగరాలలో విద్యాసంస్థలు

### ఈనెల 15 దాకా తెరవ వద్దని సిఫార్సు

హైదరాబాదు, జూలై 4: హైదరాబాదు, సికిందరాబాదు జంటనగరాలలోని విద్యాసంస్థలను ఈనెల 15 దాకా తెరవవద్దని శీతజ్వర నిరోధక ఏర్పాట్లను సమన్వయం చేసేందుకు నెలకొల్పిన అధికారుల సంఘం నేటి ఉదయం సమావేశంలో సిఫార్సుచేసింది.

ఈ సంఘంలో పురపాలక సంఘాల అధికారులూ, వైద్యాధికారులూ, సైనికాధికారులూ సభ్యులు. ఈ సంఘం లోగడచేసిన నిర్ణయంప్రకారం ఈనెల 8వ తేదీన జంటనగరాలలోని విద్యాసంస్థలను తెరవవలసిఉన్నది. కాని, ఈనెల 15 దాకా విద్యాసంస్థలను తెరవ వద్దని ఇప్పుడు సిఫార్సుచేశారు.

# శీతజ్వరంవల్ల హైదరాబాదులో ఒకరి మరణం

## వ్యాధి నివారణకు గట్టి ఏర్పాట్లు

హైదరాబాదు, జూలై 4: హైదరాబాదులో శీతజ్వరం కిందటి నెల 28 వ తేదీనుంచి ప్రారంభంకాగా, ఆ వ్యాధి వల్ల ఒకరు ఆసుపత్రిలో ఇవాళ మరణించారు. ఈ వ్యాధివల్ల ఇక్కడ సంభవించిన మరణాలలో ఇదే మొదటిది.

ఈ జబ్బు బాగా ముదిరి ఊపిరితిత్తులు దెబ్బతిన్న దశలో రెండు రోజులకిందట ఈరోగిని ఆసుపత్రిలో చేర్చగా ఇవాళ్ళ మరణించాడని నగరపాలక సంఘం ఆరోగ్యశాఖాధికారి శ్రీ సి. ఆర్. నాయుడు చెప్పారు.

ఈవ్యాధి ఇంకా ఎక్కువకాకుండా నివారించేందుకు ఫలక్‌నుమా, ఆసఫ్ నగరం తదితరప్రాంతాలలో 12 తాత్కాలిక చికిత్సాలయాలను ఇవాల్టినుంచీ ఏర్పాటు చేశారు.

నగరంలోనివివిధఆసుపత్రులలోనూ, వైద్యులవద్ద ఇవాళ్ళ మొత్తం దాదాపు 2 వేలమంది శీతజ్వర రోగులు మందు పుచ్చుకున్నారు.

జూలై 15 వ తేదీకి పాఠశాలలనూ, కళాశాలలనూ తెరవవద్దని విద్యాశాఖాధికారులకు సలహా చెప్పామని శ్రీ నాయుడు అన్నారు.

నగరంలోని.పారిశ్రామికసంస్థలలోని మొత్తం పనివారిలో నూటికి 30 మంది దాకా శీతజ్వరంవల్ల పనికి పోలేకపోతున్నారు. బ్యాంకులూ, తంతితపాలా కార్యాలయాల పని గంటలను తగ్గించారు. అయితే ఆసుపత్రులలో మందుపుచ్చుకునేవారి సంఖ్య తగ్గింది.

## కొన్నిప్రాంతాల్లో శీతజ్వరం తగ్గుదల

### హాన్నేరితాలూకా గ్రామంలో ఇద్దరి మృతి

మద్రాసు, జూలై 5: ఆంధ్రలో కొన్ని ప్రాంతాలలో శీతజ్వరంతోతగ్గుముఖం పట్టినట్లు వార్తలు వస్తున్నవి.

చెంగల్పట్టు జిల్లాహాన్నేరితాలూకా కారిపాకగ్రామంలో శీతజ్వరం అధికంగా వ్యాపించినట్లు ఇంతవరకు ఆ వ్యాధివల్ల ఇద్దరుఒకస్త్రీ-ఒకయువకుడు మృతిచెందినట్లు స్థానిక ప్రాథమిక పాఠశాల ప్రధానోపాధ్యాయుడు తెలియపరచుతున్నారు. గ్రామంలో ఎక్కువమంది చేనేత కార్మికులు. వైద్య సహాయం కల్పించడానికి ప్రభుత్వం వెంటనే తగుచర్యలు జరపాలని ఆయన విజ్ఞప్తి చేస్తున్నారు.

### మంగళగిరి

ఇక్కడ శీతజ్వరం తగ్గుతున్న సూచనలు ఉన్నవని ఆరోగ్యశాఖాధికారుల వల్ల తెలుస్తున్నది. ఈ వ్యాధి సోకినవారికి చికిత్స చేయడానికి స్థానిక లోకల్ ఫండ్ ఆస్పత్రిలో మందులు లేవు. ప్రజలు, ఆరోగ్యశాఖాధికారులు ఎన్ని పర్యాయాలు విజ్ఞప్తి చేసినా ప్రభుత్వం ఇంతవరకు మందులు సరఫరాచేయలేదు. (స్వ. వి)

### కావలి

క్రిందటివారం ఈ గ్రామంలో మొత్తం 1502 మందికి శీతజ్వరం వచ్చినట్లు ఆరోగ్యశాఖాధికారులవల్ల తెలుస్తున్నది. ఈ వారం వ్యాధి తగ్గుముఖంపట్టినదని అధికారులు చెబుతున్నారు.పంచాయతీ అధికారులు పేదలకు ఉచితంగా మందులు ఇస్తున్నారు. (స్వ. వి.)

### తణుకు

తణుకులో శీతజ్వరం ఉధృతంగా వ్యాపించినది. గ్రామంలో రోగులులేని ఇల్లు లేదు. పంచాయతి అధికారులుకాని ఆరోగ్యశాఖాధికారులుకాని మందులు ఇచ్చే ఏర్పాట్లు చేయకపోవడం చేత పేదలకు చాల ఇబ్బంది కలుగుతున్నది.

తణుకు వైద్య సంఘం క్రిందటి మంగళవారం పురమందిరంలో డాక్టర్ తణుకు భాస్కరరావు అధ్యక్షతన సమావేశమైనది. శీతజ్వర నివారణకు, చికిత్సకు అనుసరించవలసిన పద్ధతులు గురించి సమావేశంలో చర్చలు జరిగినవి. (స్వ. వి.)

### గద్వాల

గద్వాలలో శీతజ్వరం ఉధృతంగా వ్యాపిస్తున్నది. ఆస్పత్రిలో మందులు తీసుకుంటున్న వారిసంఖ్య నూటికిపైగా ఉన్నది. ఈగ్రామంలో ఇంతవరకు ఈ వ్యాధి దాదాపు 800 మందికి సోకినట్లు తెలుస్తున్నది.

క్రిందటి మంగళవారంనుంచి గ్రామంలో సినిమా హాల్సు మూసివేశారు. ఈనెల 8 వ తేదీవరకు పాఠశాలలు మూసివుంచడానికి అధికారులు ఉత్తర్వుచేశారు.

ఈవ్యాధి అలంపురం తాలూకా గ్రామాలలోకూడా ఉధృతంగా వ్యాపిస్తున్నట్లు తెలుస్తున్నది. (స్వ. వి.)

## తణుకులో మశూచి వల్ల 8 మంది మృతి

తణుకు, జూలై 3 : పట్టణంలో శీతజ్వరంతో పాటు మశూచికూడా తీవ్రంగా వ్యాపిస్తున్నది. ఇంతవరకు మశూచివల్ల 8 మంది మరణించినట్లు ఆరోగ్యశాఖాధికారులవల్ల తెలుస్తున్నది.

మశూచి వ్యాప్తి నిరోధించడానికి పంచాయతీ అధికారుల వద్ద టీకాల మందు లేదనికూడా తెలుస్తుది.

## మైకా కార్మికులకు అన్యాయాలు

### కమీషనరుకు ప్రతినిధుల విజ్ఞప్తి

గూడూరు, జూలై 1: మైకా కార్మికులకు కనీస వేతనాల చట్టం, రాత్రి వరకులు, సెలవులు, బోనసులు, మొదలగు వాటిని కొందరు యజమానులు అమలు జరుపడం లేదని కొందరు ఆదివారాలకు జీతం కట్టి ఇవ్వడం లేదని ఆంధ్రప్రదేశ్ మైకా కార్మిక సంఘం తరఫున శ్రీ పి. సి. రెడ్డి, శ్రీ పి. సి. సుబ్బయ్య, శ్రీ జక్కల ఆదిశేషయ్య, ప్రాంతీయ కార్మిక కమిషనరు శ్రీ ప్రహ్లాదసింగ్‌కు తెలియబరచుతూ ఒక వినతి పత్రం సమర్పించారు. వెంకటగిరి రాజా నిర్వహిస్తున్న రెండు గనులలో పనిచేసే 500 కార్మికులకు 4½ సంవత్సరాల నుంచి బకాయి వేతనాలు రు. 50 వేలవరకు పేరగాయని వివరించారు.

ఈ విషయాలు పరిశీలిస్తామని కమీషనరు హామీనిచ్చారు.

## ఆంధ్రప్రదేశ్‌లో శీతజ్వరం స్థితి

### తగ్గుముఖం పట్టిందని కేంద్ర ప్రకటన

మదరాసు, జూలై 5: జూన్ 28 తేదీ వరకు ఆంధ్రప్రదేశ్‌లో 85511 మందికి శీతజ్వరం తగిలి అయిదుగురు చనిపోయినట్లు, అందులో ఒక్క జూన్ 24 తేదీన 5,6669 కేసులు వచ్చినట్లు శీతజ్వరం గూర్చి భారత ప్రభుత్వ సమాచారశాఖ నివేదిక ద్వారా తెలుస్తోంది. అయితే జూన్ 26 తేదీనుండి హైదరాబాదులో ఈ వ్యాధి తగ్గుముఖంలో వుందనీ జూన్ 26 నమాత్రం 715 కేసులు నమోదు అయ్యాయనీ అందులో వుంది. జూన్ 28 తేదీన 462 కేసులు నమోదు అయ్యాయి. హైదరాబాదు, చిత్తూరు తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి, కర్నూలు, మెదకు జిల్లాల్లో దాదాపు లేనట్లేనని కూడా నివేదికవల్ల తెలుస్తోంది.

## 25 పర్యాయాలు రక్తదానం

మదరాసు, జూలై 4: గూడూరులో న్యాయవాదిగా ఉన్న శ్రీ ఎస్. వి. యీ రోజున ఇక్కడి ప్రభుత్వ జనరల్ ఆస్పత్రిలో 'బ్లడ్ బ్యాంకు'కు రక్తదానం చేశారు.

శ్రీ నరసింహారావు ఇంతవరకు 25 పర్యాయాలు ఈ బాంకుకు రక్తదానం చేశారు. ఇన్ని పర్యాయాలు తనంతట తాను రక్తదానం చేసిన వ్యక్తి భారత దేశంలో లేదని ఆస్పత్రి అధికారులు చెప్పారు.

## మద్రాసు ఇండ్ల అద్దెల అదుపు చట్టం

మద్రాసు, జూలై 4: మద్రాసు ఇండ్ల అద్దెల అదుపుచట్టాన్ని (1949) మరి రెండేళ్ళవరకు అనగా 1957 సెప్టెంబర్ 30 నుంచి 1959 సెప్టెం 30 వ తేది వరకు పొడిగించటానికి మద్రాసు ప్రభుత్వం ఒక బిల్లును ప్రచురించినది.

మద్రాసులో ఇండ్ల వసతి పరిస్థితి యింకా క్లిష్టంగా ఉన్నందువల్లను భాషావారి రాష్ట్రాలు ఏర్పడినప్పటికీ కూడా ఇండ్లకొరత యిదివరకుమల్లె ఉంటూ పరిస్థితి రేమాత్రం వృద్ధి కానందువల్లనూ యీ శాసనం జీవితకాలాన్ని యింకా రెండేళ్లకు పొడిగించవలసిన అవసరం కలిగినదని బిల్లు ఉద్దేశాలలో ప్రభుత్వం తెలిపియున్నది.

## జమాబందిలో పాల్గొన గ్రామోద్యోగుల నిరాకరణ

బందరు, జూలై 4 : గ్రామాల జమాబంది కార్యక్రమం నేటి సాయంకాలం ఇక్కడి తాలూకా ఆఫీసులో ప్రారంభమైనది. మొత్తం 11 గ్రామాలలో అయిదు గ్రామాల ఉద్యోగులు ఈ కార్యక్రమంలో పాల్గొంటున్నారు.

దివి తాలూకా జమాబంది పరిస్థితి కూడా కొంచెం ఇంచుమించు ఇదే విధంగా వున్నదని తెలుస్తున్నది.

జమాబందికి హాజరు కావకుండా ఉన్న గ్రామోద్యోగులు అందరిని కూడగట్టుకొని తమ "సత్యాగ్రహం" విజయవంతంగా సాగేటట్లు చూడడానికి కృషి చేస్తున్నారు. జమాబంది ఈ నెల మధ్యవరకు సాగుతుంది. (స్వ. వి.)

## ఆంధ్ర విశ్వవిద్యాలయ సెనేటుకు ఎన్నిక

వాల్తేరు, జూలై 4: తూర్పు గోదావరిజిల్లా స్థానికసంస్థల నియోజకవర్గం నుంచి ఆంధ్ర విశ్వవిద్యాలయ సెనేటుకు కాకినాడ పురపాలక సంఘాధ్యక్షుడు శ్రీ దంటు భాస్కరరావు ఎన్నికైనారని రిజిస్ట్రారు ప్రకటించారు. శ్రీ భాస్కరరావు సెనేటు పునర్నిర్మాణం జరిగే పర్యంతం సభ్యుడుగా ఉంటారు.

# మాలటోవ్ వర్గానికి మంత్రివర్గంనుండి స్వస్తి

## ఇక పరిస్థితులు మెరుగు

## ఔతాయని మికోయాన్ ఆశ

లండన్, జూలై 4: రష్యా కమ్యూనిస్టుపార్టీ అధిష్ఠాన వర్గంనుండి బర్తరఫ్ చేసిన మాలటోవ్, కగనోవిచ్, మాలెంకోవ్‌లను మంత్రిపదవులనుండికూడా తొలగించారని నేడు మాస్కో రేడియో ప్రకటించింది.

వీరిని తొలగించడంవల్ల ఇదివరకుకన్నా పరిస్థితులు మెరుగు కాగలవని మాస్కోలోని అమెరికా రాయబార కార్యాలయంలో అమెరికా స్వాతంత్ర్య దినోత్సవ సందర్భంలో జరిగిన సభలో మాట్లాడుతూ రష్యా ఉపప్రధాని మికొయాన్ అన్నారు.

ఇంతవరకూ మాలటోవ్, కగనోవిచ్, మాలెంకోవ్‌లు ఉప ప్రధానులుగా ఉన్నారు. మాలెంకోవ్ విద్యుత్ కేంద్రాలశాఖ మంత్రిగాను, మాలటోవ్ స్టేట్ కంట్రోల్ శాఖామంత్రిగాను కూడా వ్యవహరిస్తున్నారు. ఈ నాయకులను మంత్రి పదవులనుండి తొలగించాలని సుప్రీం సోవియట్ ...

## యూరప్‌లోని రష్యా సైన్యాల ఉపసంహరణ?

బెల్గ్రేడ్, జూలై 4: రష్యా కమ్యూనిస్టుపార్టీని మరింత కట్టుదిట్టం చేసేందుకు శ్రీ కృశ్చేవ్ నూతన విధానాలను ఊహించడానికి యుగోస్లావ్ వర్గాలు ...

## నాయకత్వంకోసం కృషి

## మార్పులు కోరేవారు వెళ్లిపోయారు

## విభేదాలు పరిష్కారం కాలేదని బ్రిటన్

## తూర్పు జర్మనీ హర్షం

## రుమేనియా కమ్యూనిస్టు పార్టీ నాయకుల బర్తరఫ్

# నెహ్రూ సుముఖ భావం

(1 వ పుట తరువాయి)

సుముఖంగా ఉన్నాయి.

కొద్దిమాసాలే పరీక్షలను నిలిపినంత మాత్రంలో ఫలితం ఏమీ కలగదు.

పరీక్షల నిలుపుదల మొత్తంమీద కాంక్షించవలసినదే. నిలిపినంతలో రాజ్యాలమధ్య బలాబలాల భేదాలు పోవు. దీనివల్ల అసలుసమస్యను సరియైన వాతావరణంలో సమగ్రంగా చర్చించడానికి వ్యవధి లభిస్తుంది.

పరీక్షల నిలుపుదలతో, ఇప్పటికే అణ్వస్త్రసామగ్రి నిలుపుదల, సాధారణ ఆయుధసామగ్రి సైనికబలాల తగ్గింపు కూడా సాధించడమే తమకు యిష్టం అని శ్రీ నెహ్రూ అన్నారు.

## అణురజ వ్యాప్తి దోషంలేని బాంబులు

ఇటీవల అణురజవ్యాప్తి దోషంలేని అణ్వస్త్రాలంటూ ఒక మాట మరీ వినవస్తోంది, అన్నారు శ్రీ నెహ్రూ.

దోషంలేని బాంబులు అనడంలో అణురాజం అట్టే వ్యాపించనిది, అని వారి అర్థం. కాని భారత శాస్త్రజ్ఞులు తెలిపిన సమాచారాన్నిబట్టి, ఈ బాంబులను ఆకాశంలో బాగా ఎత్తులో ప్రేల్చినట్లయితే భూమిపైన అణురజ వ్యాప్తి చాలా తక్కువే ఉండవచ్చు కాని, అణురజం అంతా వాయుమండలంలో బాగా ఎత్తులో వ్యాపించి ఏళ్ళుదశాబ్దాలతరబడి అక్కడే ఉండి, వాతావరణంలో రేడియో ధార్మికశక్తిని ...

వల్ల ఇజ్రేల్ కాని ఏనాడూ పడనంత కష్టం, భారతదేశం పాకిస్తాన్‌వల్ల పడుతున్నదని శ్రీ నెహ్రూ జవాబిచ్చారు. ఆరాజ్యాలు ఎన్నడూ చూపనంతఓర్మి భారతదేశం చూపుతున్నదన్నారు.

కాశ్మీరు వ్యవహారంగురించి ప్రశ్నలకు జవాబులిస్తూ శ్రీ నెహ్రూ ఈక్రిందివిధంగా తమ అభిప్రాయాలు తెలిపారు:

కాశ్మీరులో సగప్రాంతంలో పాకిస్తాన్ సైన్యం ఆక్రమించుకుని కూర్చోవడంలో ఏవిధమంతైనన్యాయం ఏమున్నదో తెలియదు. న్యాయ విహితం, రాజ్యాంగబద్ధమైన ఒకపద్ధతిని అనుసరించి కాశ్మీరు భారతదేశంలో చేరిపోయింది. కాశ్మీరు పాకిస్తాన్‌తో చేరిందని కాని, చేరడానికి ప్రయత్నించిందని కాని ఏనాడు ఒక్కరైనా అనలేదు, అనలేరు. తొమ్మిదేళ్ల క్రిందట పాకిస్తాన్ దురాక్రమణజరిపింది; ఇంకా కాశ్మీరులో సగభాగం ఆక్రమించుకు కూర్చుంది.

జనవాక్య సేకరణగురించి వచ్చిన ప్రశ్నకు జవాబుగా శ్రీ నెహ్రూ 1948 ఆగస్టు సమితితీర్మానం, ఆ తరువాత 1949 జనవరి తీర్మానం గుర్తుచేశారు.

ఆతీర్మానాల ప్రకారం పాకిస్తాన్ తన సైన్యాన్ని కాశ్మీరునుంచి ఉపసంహరించి ఉండవలసింది. ఆ తరువాత భారతదేశం తన సైన్యంలో చాల భాగాన్ని ఉపసంహరించాలి. అప్పుడు సమితిప్రతినిధి సైనికోప సంహరణ జరిగినట్లు నమోదుచేస్తే, ఆతరవాత కాశ్మీరు ప్రజల అభిమతాన్ని ఎలా తెలుసుకోవాలి, అని భారత ...

## పాకిస్తాన్‌తో వ్యవహారం

## భారతదేశం చూపినంత ఓపిక విదేశం చూపలేదు

## కాశ్మీర్‌పై బ్రిటిష్ ప్రధానితో చర్చ

## హంగరీలో ఉన్నది వలసవిధానం కాదు

## వలసతత్వం

# ఉత్తర అట్లాంటిక్ రక్షణ అల్జీరియా భక్షణ అయింది

## విదేశ వ్యవహారాల సంఘంలో రక్షణ సహాయ కార్యదర్శి సాక్ష్యం

## సమితి సైన్యంలో భారత దళం

## అల్జీరియా పరిస్థితి పాడౌతున్నది

## భారత ఆర్థికస్థితి

## గోవా

# పశ్చిమ పాక్‌లో మళ్లీ రిపబ్లికన్ మంత్రివర్గం?

## మీర్జాకు గవర్నర్ గుర్మానీ సిఫార్సు

లాహోర్ జూలై 4 పశ్చిమ పాకిస్తాన్‌లో రిపబ్లికన్ మంత్రి వర్గాన్ని పునరుద్ధరించ వలసినదిగా గవర్నర్ శ్రీ ముష్తాక్ అహమ్మద్ గుర్మానీ, అధ్యక్షుడు శ్రీ ఇస్కందర్ మీర్జాకు సిఫార్సు చేస్తున్నారని యీ పార్టీ ప్రతినిధి ఒకరు తెలియజేశారు.

రిపబ్లికన్ ప్రభుత్వం గతిమార్చిలో రద్దు అయిన సంగతి పాఠకులకు విదితమే.

వెనుకటి ముఖ్యమంత్రి డాక్టర్ ఖాన్ సాహెబ్ రిపబ్లికన్ పార్టీ ప్రధాన కార్యదర్శి శ్రీ అబిద్ హుస్సేన్ గత రాత్రి గవర్నర్‌ను కలుసుకొని రెండున్నరగంటలసేపు చర్చలు జరిపినట్లు వీరు ప్రకటించారు.

పశ్చిమ పాకిస్తాన్ శాసనసభలో, రిపబ్లికన్ పక్షానికిగల బలంపట్ల గవర్నర్ సంతృప్తి చెందారని గూడా వీరన్నారు. మొన్న మంగళవారం రోజున జరిగినపార్టీ సమావేశంలో యీ అంశం స్పష్టం అయిందట.

మొత్తం 308 మంది శాసనసభ్యుల్లో 146 మంది ఈ సమావేశానికి హాజరై రాష్ట్రంలో ప్రజాస్వామిక ప్రభుత్వం ఏర్పడాలంటూ తీర్మానించారు.

## పాకిస్తాన్ విమాన ప్రమాదం

## ప్రయాణీకులంతా మరణించి వుంటారు

# హంగరీపై సమితి నివేదిక

## అధికప్రచారం చేయాలని గైట్‌స్కెల్ సూచన

వియన్నా, జూలై 8: హంగరీపై సమితినివేదికనుగురించి వీలైనంతవరకూ ప్రచారంచేయాలనీ, హంగరీలో రష్యా చర్యలకు తాము భీతిచెందామని ప్రతివారితోనూ చెప్పాలనీ అంతర్జాతీయ సోషలిస్టు మహాసభలో మాట్లాడుతూ బ్రిటిష్ కార్మికపక్ష నాయకుడు గైట్‌స్కెల్ అన్నారు. ఇలాంటి ప్రచారం రష్యాపరిపాలకులపై అత్యంత ప్రభావాన్ని కనబరుస్తుందన్నారు. తూర్పు యూరప్ రష్యా ఉపగ్రహ రాజ్యాలలో ఎన్నో మార్పులు జరుగుతున్నాయి. ఈప్రచారంవల్ల ఈదేశాలు విముక్తిపొందే అవకాశం ఉంది. ఈ దేశాలలోని ప్రజలు దిమ స్వాతంత్ర్యాన్ని వినవాడవలసిన అవసరం ఏమీలేదుఅని ప్రపంచపరిస్థితిపై చర్చను ప్రారంభిస్తూగైట్‌స్కెల్ అన్నారు.

## యూరప్ స్వేచ్ఛా వ్యాపారం

## ఫ్రెంచి పార్లమెంటుకు తూర్పు జర్మనీ హెచ్చరిక

## తీర వ్యాపారానికి ఆరు చిన్న నౌకలు

## వసంతసేర్ వెళ్లడి

లండన్, జూలై 4: భారతదేశం తీర వ్యాపారాభివృద్ధికి తమ సంస్థకు ఆరు లిబర్టీనౌకలు రావచ్చునని గ్రేట్ ఈస్టరన్ షిపింగ్ కంపెనీ మేనేజింగ్ డైరెక్టరు శ్రీ వసంతసేర్ ఇక్కడ తెలిపారు.

అమెరికా నుండి లిబర్టీ నౌకల విడుదల విషయమై వాషింగ్టన్‌లో ఒక సెనేట్ సంఘం ఎదుట సాక్ష్యంఇచ్చి, ఈయన భారత దేశానికి తిరిగి వస్తున్నారు. మొదట ఈ సంస్థ 12 నౌకలను కోరింది.

# కామన్వెల్త్ దేశాల వాణిజ్య ఒప్పందం

## భారత ప్రధాని సూచనపై మాక్మిలన్ ఆశాభావం

లండన్, జూలై 4: కామన్వెల్త్ దేశాలువాణిజ్య ఒప్పందంచేసికొనేందుకు సమావేశం జరపాలని కెనడా, భారత ప్రధానులుచేసిన సూచన సఫలం కాగలదనే తాను భావిస్తున్నానని కామన్స్‌సభలో బ్రిటిష్ ప్రధాని మాక్మిలన్ అన్నారు.

కన్సర్వేటివ్ సభ్యుడు రొనాల్డ్ రసెల్ ప్రశ్నకు సమాధానం ఇస్తూ ఈ సూచనను కామన్వెల్త్ దేశాల ప్రధానమంత్రులు చర్చిస్తున్నారని, వారు నిర్ణయంచేసేవరకూ వేచిఉండవలసిందనీ మాక్మిలన్ అన్నారు.

భారత కెనడా ప్రధానుల సూచనను బ్రిటిష్ ప్రజలలో అత్యధికులు ఆమోదిస్తున్నారని, అందువల్ల ఈసూచన సఫలం కావడానికి తగు చర్యలు తీసికోవాలనీ కార్మికపక్ష సభ్యుడు స్మిత్ అన్నారు.

## మలయాకు కామన్వెల్త్ సభ్యత్వం

వచ్చే ఆగస్టు 31 న స్వాతంత్ర్య దేశంగా అవతరించిన అనంతరం మలయాకు కామన్వెల్త్‌లో సభ్యత్వం ఉండాలని కామన్వెల్తు ప్రధానులు నిర్ణయించారు. ఆగస్టు 31 న భారత ...

సభ్యులు ఒకప్రకటనచేశారు.

కామన్వెల్త్ ప్రధానులలో ముందుగా కెనడాప్రధాని డైఫెన్‌బేకర్ స్వదేశానికి బయలుదేరుతున్నారు. ఈయన ఈరోజురాత్రికే బయలుదేరనున్నారు.

## బొంబాయి మార్కెట్టు

బొంబాయి, జూలై 5:

| | |
|---|---|
| వెండి | 180-8-0 |
| బంగారం | 104-9-0 |
| నవరసు | 69-4-0 |
| వేరుసెనగ విత్తులు | 86-10-0 |
| అవిశ విత్తులు | 28-10-0 |
| అవిశనూనె | 16-0-0 |
| ఆముదాలు | 83-4-0 |
| వేరుసెనగనూనె | 20-9-0 |
| నైగర్ విత్తులు | 28-8-0 |

# భారతదేశానికి డబ్బు ఇబ్బంది తాత్కాలికమే

## రెండో ప్రణాళికతో చిక్కులు తీరిపోగలవని నెహ్రూ వివరణ

### భారత అభివృద్ధి ప్రణాళికలపట్ల సురావర్ది అక్కసు

లండన్, జూలై 4: ద్రవ్యంకోసం భారతదేశం ఈనాడు పడుతున్న కష్టాలు తాత్కాలికమే, ద్వితీయ పంచవర్ష ప్రణాళిక అమలుజరుగుతూ పోతున్నకొద్దీ, పెట్టుబడిపై ఫలితాలు రావడం మొదలుపెట్టినతరవాత, ఈ చిక్కులన్నీ తొలగిపోవడమేకాదు, స్టెర్లింగ్ ప్రాంతానికి భారతదేశం బలం చేకూర్చగల స్థితికి వస్తుంది, అని భారతప్రధాని శ్రీ నెహ్రూ ఇవాళ కామన్వెల్త్ ప్రధానుల సమావేశంలో వివరించారు.

కామన్వెల్తు ప్రధానమంత్రుల సమావేశంలో నిన్న స్టెర్లింగ్ ప్రాంత రాజ్యాల ఆర్థిక స్థితిగతులపై చర్చ జరిగింది. ప్రతినిధు లందరూ తమ తమ దేశాలలో పరిస్థితులను వివరించారు.

కెనడా మినహా మిగతా కామన్వెల్తు రాజ్యాలన్నీ స్టెర్లింగ్ ప్రాంత రాజ్యాలే.]

భారత ద్వితీయ పంచవర్ష ప్రణాళిక ప్రస్తుత కార్యవిధానాన్ని శ్రీ నెహ్రూ వివరించారు.

బ్రిటిషు ప్రధాని శ్రీ మాక్మిలన్, ఆర్థికమంత్రి శ్రీ పీటర్ థార్నీ క్రాఫ్ట్ భారతకృషిని సహృదయంతో అర్థం చేసుకున్నట్లు తెలియపరిచారట.

### సురావర్ది అపూర్వ వర్తన

అయితే కామన్వెల్తు ప్రధానుల సమావేశంలో ఏనాడూ జరగనిది నిన్న జరిగింది. పాకిస్తాన్ ప్రధాని శ్రీ సురావర్ది భారతప్రణాళికను, భారతదేశాన్ని విమర్శించారు. ప్రధానుల సమావేశంలో ఒక ప్రతినిధి మరో ప్రతినిధినికాని, మరో దేశాన్ని కాని విమర్శించడం అపూర్వం, ఇదే మొదటి పర్యాయం.

నిన్నటి సమావేశంలో విమర్శనా పూర్వకంగా ప్రసంగించినవారు ఫీరోజ్ ఖాన్ నూన్ ... అయితే వీరు భారతదేశం అని పేర్కొనలేదు.

సింధునిబట్టి రొట్టె అనే ధోరణిలో పాకిస్తాన్ స్టెర్లింగ్ ప్రాంతం ఆర్థికబలం నిలపడంకోసం అనేక అభివృద్ధి కార్యక్రమాలను ప్రాజెక్టులను త్యాగం చెయ్యగా, భారతదేశం మాత్రం విరుద్ధంగా ప్రవర్తిస్తోంది, అని శ్రీ సురావర్ది అన్నారు.

భారతదేశాన్ని ఈ విధంగా చిత్తం వచ్చినట్లు ఖర్చులు పెట్టనిచ్చేపక్షంలో, స్టెర్లింగ్ ప్రాంతం గతి ఏమౌతుందో అనే శంక లేకుండా, ఆ ప్రాంతపు నిధులను కడతేర్చి అభివృద్ధి కార్యక్రమాలను జోరుగా సాగించవచ్చునని పాకిస్తాన్‌కు మాత్రం ఎందుకు అనుమతి ఇవ్వకూడదు? అని శ్రీ సురావర్ది ప్రశ్నించారు.

భారతప్రధాని శ్రీ నెహ్రూ దీనికి జవాబిస్తూ, భారతదేశం అపారంగా ద్రవ్యం వెచ్చిస్తున్నదంటే, విలాస సామగ్రిపై వెచ్చించడం లేదని చెప్పారు. పారిశ్రామిక వ్యవస్థకు ప్రాతిపదిక నిర్మించడానికి మాత్రమే వెచ్చిస్తున్నదన్నారు.

అపార త్యాగాలుచేసి స్టెర్లింగ్ నిధులను నిర్మించారంటే, ఇటువంటి నిర్మాణకార్యక్రమాలకే, అని శ్రీ నెహ్రూ చెప్పారు.

శ్రీ సురావర్దికి భారతదేశం అంటే ఇష్టంలేదని తెలుస్తూనే ఉందని శ్రీ నెహ్రూ అన్నారట.

### బట్లర్‌తో నెహ్రూ గోష్ఠి

లండన్, జూలై 3: బ్రిటిష్ దేశీయాంగమంత్రి శ్రీ ఆర్. ఏ. బట్లర్ ఇవాళ మధ్యాహ్నం శ్రీ నెహ్రూ ఇంటిలో ఆతిథ్యం స్వీకరించారు.

ఉభయులూ కొద్దిసేపు సమాలోచనలు సాగించారు.

నిన్న సాయంకాలం శ్రీ నెహ్రూ గౌరవార్థం, భారత హైకమీషనరు శ్రీమతి విజయలక్ష్మి విందుచేశారు. విందుకు బ్రిటిష్ ప్రధాని, వారి సతీమణి, శ్రీ బట్లర్, అట్లీదంపతులు, పీటర్ థార్నీక్రాఫ్ట్, మౌంట్‌బాటెన్ దంపతులు, లండన్‌లో రాయబారులందరు, శ్రీ కృష్ణమీనన్, శ్రీ యన్. ఆర్. పిళ్ళే, సర్దార్ పణిక్కర్, మొదలైనవారు చాలామంది వచ్చారు.

ఫ్రాన్సులోని భారత రాయబారి శ్రీ పణిక్కర్, శ్రీ నెహ్రూతో సంప్రదింపులకోసం ఇక్కడకు వచ్చారు.

## విదేశాలకు అమెరికా యురేనియం

### స్ట్రాస్ వివరణ

వాషింగ్టన్, జూలై 4: దేశంలోను, విదేశాలలోను శాంతి విధానాలలో ఉపయోగం నిమిత్తం 69,800 కిలోగ్రాముల పరిశుద్ధి చేసిన యురేనియంను (యు-235) అమెరికా కేటాయించింది. ఇదివరలో 40,200 కిలోగ్రాముల యురేనియంను ఇందుకు కేటాయించారు. ఈ విషయాన్ని నిన్న పత్రికా ప్రతినిధుల సమావేశంలో ఐసెన్‌హోవర్ వివరించారు.

ఈ విషయాన్ని అణుశక్తి పరిశీలక సంఘం అధ్యక్షుడు లూయీస్ట్రాస్ వివరిస్తూ, యురేనియం గురించి అమెరికాతో సంప్రదింపులుజరిపిన, జరుపుతున్న దేశాలు 709 వేల కిలోగ్రాములు అధికంగా కావాలని సూచించాయి. అధ్యక్షుడు కొత్తగా చేసిన నిర్ణయంవల్ల విదేశాలకు అవసరమైన ఏభైవేల కిలోగ్రాములను సరఫరా చేసే అవకాశం ఉంది అని స్ట్రాస్ తెలిపారు. వివిధ దేశాలలో ఏడు అణు ఉత్పాదకయంత్రాలను నెలకొల్పడానికి ఒప్పందాలు కుదిరాయి; మరో ఏడింటిని నెలకొల్పడానికి సంప్రదింపులు సాగుతున్నాయి; 29 పరిశోధక ఉత్పాదక కేంద్రాలను ఇప్పుడు అమెరికా సహాయంతో ఏర్పాటు చేస్తున్నారు. మరో ఎనిమిదింటిని గురించి రాయబారాలు సాగుతున్నాయి అని కూడా ఆయన తెలిపారు.

## అమెరికా స్వాతంత్ర్య దినోత్సవం

### రాష్ట్రపతి, ప్రధానుల శుభాకాంక్షలు

న్యూఢిల్లీ, జూలై 3: రేపు జరుగనున్న అమెరికా స్వాతంత్ర్య దినోత్సవానికి రాష్ట్రపతి, ప్రధాని, తమ తమ శుభాకాంక్షలు తెలుపుతూ సందేశాలు పంపించారు.

"ఈ శుభ సమయంలో మీకు, అమెరికా ప్రజలకు, భారతీయుల తరఫున, నా శుభాకాంక్షలను అందజేస్తున్నాను. మీ ప్రజలు సుఖంగా వర్ధిల్లాలి" అని అమెరికా అధ్యక్షునికి పంపిన సందేశంలో రాష్ట్రపతి తెలియజేశారు. అమెరికా విదేశాంగమంత్రికి, ప్రధాని యీ క్రింది సందేశం పంపించారు.

"అమెరికా స్వాతంత్ర్య దినోత్సవ సమయంలో నేను, నాతోటి మంత్రులు, అమెరికా ప్రభుత్వానికి, మా శుభాకాంక్షలను తెలుపుతున్నాము. మీ ప్రజలు ఐశ్వర్యంతో తులతూగుతూ సుఖంగా వర్ధిల్లాలని ఆశిస్తున్నాము.

"మానవజాతి శాంతి ఐశ్వర్యాలతో పురోగమించేందుకు, మనం కొనసాగిస్తున్న సమిష్టి కృషి ముందు ముందు యింకా విస్తృతం కావాలని హృదయపూర్వకంగా వాంఛిస్తున్నాము."

## రైళ్లలో పుట్టకురుపు రోగులకు సదుపాయాలు

న్యూఢిల్లీ జూలై 2: రైళ్ళలో ఒకటి రెండు మూడు తరగతులలో ప్రయాణం చేసే పుట్టకురుపు రోగులకు 1-7-57 తేదీనుంచి యీ క్రింది సదుపాయాలను చేయుటానికి రైల్వేల పాలకవర్గం నిశ్చయించి ఉన్నది.

పుట్టకురుపు రోగులు ఆసుపత్రులలో చేరేందుకుగాని లేదా చికిత్స పొంది యింట్లకు తిరిగివెళ్ళేటప్పుడు గాని ఒక మనిషిని వెంటబెట్టుకొని రైళ్ళలో వెళ్లదలచినప్పుడు వారు ప్రయాణంచేసే తరగతి ఛార్జీ ఉభయులకు ఒకేఛార్జీక్రింద వసూలు చేయగల సదుపాయాన్ని చేసేఉన్నారు. ఈ రోగులు యిట్టి సదుపాయాన్ని పొందటానికి ఆసుపత్రి అధికారుల నుంచి సర్టిఫికేటు అవసరం.

మనిషి వెంట లేకుండా రోగి మాత్రమే ప్రయాణం చేయదలిస్తే ఒక ప్రయాణానికి చెల్లించవలసిన టికెట్టు ఛార్జీలో సగం వంతు డబ్బు చెల్లించాలి.

## ఢిల్లీకి రాష్ట్రపతి ప్రయాణం

పాట్నా, జూలై 4: రాష్ట్రపతి డాక్టర్ రాజేంద్రప్రసాద్ ఇవ్వాళ ఉదయం ఇక్కడి నుంచి రైలులో ఢిల్లీకి ప్రయాణమై వెళ్లారు. సుస్తీగావున్న బీహారు ఆర్థికమంత్రి శ్రీ అనుగ్రహనారాయణ సిన్హాను చూడటానికి వచ్చారు. రైలుస్టేషను దగ్గర గవర్నరు శ్రీ ఆర్. ఆర్. దివాకర్, ముఖ్యమంత్రి డాక్టరు శ్రీ కృష్ణ సిన్హా, ఇతర మంత్రులు వీడ్కోలు ఇచ్చారు.

# మామూలు నిరాయుధీకరణంలో అణ్వాస్త్ర పరీక్షలు ఉండరాదు

## సమితి ఉపసంఘంలో రష్యా సూచన: భారతప్రతినిధిరావడం అమెరికాకు అయిష్టం

మాస్కో, జూలై 3: మామూలు ఆయుధాల వ్యవహారాన్ని విడదీసి, అణ్వాస్త్ర పరీక్షలకు సంబంధించిన వ్యవహారాలను గూర్చి ఆలోచించాలని రష్యా సమితి నిరాయుధీకరణోపసంఘంలో ప్రతిపాదించింది.

టాస్ వార్తాసంస్థ ఈవార్తను అందజేస్తూ, రష్యా ప్రతినిధి శ్రీ జోరిన్ ఆ ఉపసంఘం ముందు ఈ ప్రతిపాదనను నిన్ననే ఉంచినట్లు చెబుతున్నది. "పశ్చిమ రాజ్యాలవారు నిన్న చేసిన ప్రతిపాదనలలో, ఈ అణ్వస్త్ర పరీక్షల వ్యవహారాన్నిగూర్చి ఏమి భావనచేస్తున్నది సరిగ్గా అవగాహనం కావడంలేదు. ఇతర ఆయుధ విసర్జన వ్యవహారాలను, ఈ అణ్వస్త్ర పరీక్షలకు సంబంధించిన వ్యవహారాన్ని వేరు వేరు చేసి, ఈపరీక్షల వ్యవహారాలన్ని వెంటనే తేల్చుకుందామని వీరికి, ఉన్నదీ, లేనిదీ, ఈప్రతిపాదనలు సరిగ్గా చెప్పడంలేదు" అని జోరిన్ అన్నట్లు ఈ వార్తాసంస్థ తెలియజేస్తున్నది.

### పాశ్చాత్యుల ప్రతిపాదనలు అస్పష్టం

ఈవార్తా సంస్థ చెబుతున్న దాన్నిబట్టి శ్రీ జోరిన్ యీసందర్భంలో ఇంకా ఈలా అన్నారు: పశ్చిమ రాజ్యాలవారు యీ పరీక్షలను ఎప్పుడు ఆపదలచుకున్నదీ గూడా, వారి ప్రతిపాదనలలో స్పష్టంగా లేదు. ఈ 2, 3 సంవత్సరాలలో ఆపదలచుకున్నారా? లేకపోతే ఇందుకు వారికి వేరే ఇంకో ముహూర్తం ఉన్నదా?—ఇదేమీ ఈ పాశ్చాత్య ప్రతిపాదనలలో లేవు.

### రెండింటికి ముడిపెట్టడం తగదు

"మా అభిప్రాయంలో ఈ అణ్వస్త్ర పరీక్షలను గురించిన సంగతి వెంటనే తేలాలి. దీనికి, తక్కిన నిరాయుధీకరణ సమస్యలకు సంబంధం, ముడి, పనికిరాదు. ఆ వ్యవహారాన్ని వేరుగా, ఈ వ్యవహారాన్ని వేరుగా ఆలోచించాలి."

పాశ్చాత్య రాజ్యాల ప్రతిపాదనలను ఈ సంఘంలో మొన్న బ్రిటిష్‌ప్రతినిధి శ్రీ లాయిడ్ ప్రతిపాదించారు. రష్యా ముందుకాలంలో అణ్వస్త్ర ఉత్పత్తిని ఆపివెయ్యడానికి సూత్రప్రాయంగా అంగీకరిస్తే, ఇప్పుడు అణ్వస్త్ర పరీక్షలను ఆపడాన్ని గూర్చి పాశ్చాత్య రాజ్యాలు ఆలోచిస్తాయని ఈ ప్రతిపాదనలలో ఆయన సూచించారు.

### భారతదేశాన్ని ఆహ్వానించాలి

పోతే లండన్‌నుంచి వస్తున్న వార్తలనుబట్టి, శ్రీజోరిన్ ఈ నిరాయుధీకరణోపసంఘంలో ఈపసంఘంవారు, భారత ప్రతినిధిని ఆహ్వానించాలని,ఆహ్వానించి ఈ ఆయుధ విసర్జన వ్యవహారాన్ని గూర్చి, అణ్వస్త్ర వ్యవహారాన్నిగూర్చి ఏమి చెప్పేది వినాలనిగూడా సూచించారు. కాని అమెరికా ప్రతినిధి శ్రీ స్టాస్సెన్ ఈ సూచనను తిరస్కరించారు. భారతదేశం చెప్పేమాటలను వినే సమయం ఇంకా ఆసన్నంకాలేదని శ్రీ స్టాస్సెన్ అన్నారు.

### నెహ్రూ మాట్లాడతానంటే ఆలోచిస్తాము

శ్రీ స్టాస్సెన్ ఇట్లా మాటలాడినందుకు శ్రీ జోరిన్ విచారాన్ని వ్యక్తం చేశారు. "భారతదేశం స్వతంత్రమైన దేశం. ఏ ఒక్క కూటమికి చెందినదేశం కాదు. అందువల్ల ఆదేశం చెప్పే మాటకు విలువ అధికం వుంటుంది. అమెరికా ప్రతినిధి నా సూచనను ఇట్లా తిరస్కరించాడంటే, అందువల్ల, నాకు విచారం కల్గుతున్నది" అన్నారు. అప్పుడు శ్రీ స్టాస్సెన్, తాముగూడా భారతదేశం మాటను గౌరవించేవారిలో ఒకళ్లమేనని, అయినా, ఉపసంఘం నిబంధనలనుబట్టి, సభ్యులుకానివారిని మాట్లాడనివ్వడం తగదని, కాని శ్రీ నెహ్రూ మాట్లాడతానంటే, ఆ విషయమై తమ ప్రభుత్వంతో మాటలాడతామని చెప్పారు.

### భారతదేశం అభ్యర్థన

శ్రీ జోరిన్ ఇప్పుడుగాని, ఇంతకు ముందుగాని, భారతదేశాన్ని ఈ ఉపసంఘం ఆహ్వానించి, ఆ దేశం ప్రతినిధి చెప్పదలచుకున్న దాన్ని వినాలని కోరడంలో అర్థం వుంది. ఈ ఉపసంఘం భారతదేశం, జపాను, నార్వే మొదలైన కొన్ని దేశాలను వ్రాతమూలకంగా నిరాయుధీకరణం వ్యవహారాన్ని గూర్చి సూచనలు పంపించవలసిందని కోరింది. భారతదేశం తప్ప, తక్కిన దేశాలన్నీ, అట్లా వ్రాసి పంపించాయి. భారతదేశం తనప్రతినిధిని ఆసంఘంలో మాట్లాడనీయవలసిందిగా కోరింది. ఈ కోర్కెను పాశ్చాత్య రాజ్యాలు అప్పుడూ తిరస్కరించాయి. ఇప్పుడూ ఇట్లా తిరస్కరించాయి.

### శ్రీ నెహ్రూ అభిమతం

అయితే ప్రధానమంత్రి శ్రీనెహ్రూకు గూడా ఇప్పుడు, ఈ సమయంలో, ఈ సంఘంలో, భారత ప్రతినిధి మాట్లాడ్డం మంచిదికాదన్న భావంలో వున్నట్లే తెలుస్తున్నది. కొలంబియా బ్రాడ్‌కాస్టింగ్ సిస్టంవిలేఖరితో మాట్లాడుతూ, శ్రీ నెహ్రూ ఈ విధంగా అన్నట్లు లండన్‌నుంచి వచ్చిన వార్తలు చెబుతున్నాయి. "ఇప్పుడు పెద్దరాజ్యాలు ఈ ఆయుధ విసర్జన వ్యవహారాలను గురించి తలపట్లు పట్టుతున్నాయి. ఈ సందర్భంలో మేము గూడా వెళ్ళి మాట్లాడతామనడం అంతగా బాగుండదు. ఇప్పుడు మాట్లాడే వాళ్లు అప్పుడే, అప్పుడే, అందులో, చాలామంది వున్నారు. మేము గూడా ఎందుకు?" అన్నారని, ఈ అన్నమాట అమెరికాలో టెలివిజన్ ప్రసారం కోసం రేపురికార్డుచెయ్యబడినా యని గూడా ఈ వార్తల వల్లనే తెలుస్తున్నది.

### బ్రిటిష్ ప్రతినిధుల వ్యాఖ్యానం

ఇప్పుడు భారత ప్రతినిధిని ఈ ఉపసంఘంలో మాట్లాడనీయడం అన్నది, ఉపసంఘం నిబంధనల ప్రకారం చెల్లదని, అట్లా వారిని మాట్లాడనీయాలన్నా, ఈ సంఘంలో సభ్యులంతా కూర్చుని ఆలోచించి, అందరికీ అంగీకారం అయితే, మాట్లాడనీయవచ్చునని, ఆ నిబంధనలు చెబుతున్నాయని బ్రిటిష్ ప్రతినిధులు వ్యాఖ్యానిస్తున్నారు.

### చైనా విషయం

పోతే, ఈ నిరాయుధీకరణ సమాలోచనలకు చైనాను పిల్వడం, పిల్వకపోవడం విషయంలో, అమెరికా మనస్సు, తక్కిన పాశ్చాత్య రాజ్యాల మనస్సు ఒక్క విధంగా వున్నట్లు కన్పించడంలేదు. అణ్వస్త్ర వ్యవహారాలకు సంబంధించినంతవరకు చైనాతో నిమిత్తం లేకపోయినా, మామూలు ఆయుధాలు, సైన్యాలు మొదలైన విషయాల చర్చకు వచ్చినప్పుడు చైనాను, ఈ ఉపసంఘంలో కూర్చోనీయక తప్పదన్న భావం కొంతమంది పాశ్చాత్యరాజ్య ప్రధాన ప్రతినిధులలో కన్పిస్తోంది. ముఖ్యంగా బ్రిటిష్‌వారు ఇటువంటి భావంతో వున్నారు.

అమెరికా విధానం ఇందుకుభిన్నంగా వున్నట్లు నిన్న శ్రీ డల్లెస్ అన్నమాటలవల్లనే తెలుస్తుంది. నిరాయుధీకరణ వ్యవహారంలో చైనాకు నిమిత్తం అవసరం అని, చైనా లేకుండానే, ఒప్పందం కుదరాలని, కాని రష్యా మాత్రం, చైనాచేత, ఆ ఒప్పందాన్ని పాలింపచెయ్యాలని శ్రీ డల్లెస్ అన్నారు.

## కేరళ సముద్రతీరాన చేపల మరణం

### రేడియో ధార్మికశక్తి ప్రసారం కారణమట!

హైదరాబాదు, జూలై 4: కేరళ సముద్ర తీరాన అన్ని చేపలు చావడానికి రేడియోధార్మికశక్తి ప్రసారం కారణమై ఉండవచ్చునని కేరళ రాష్ట్ర ప్రభుత్వ ఆహారశాఖ మంత్రి శ్రీ కె. సి. జార్జి అన్నారు. దక్షిణ ఆహార మండల మంత్రుల సమావేశంలో పాల్గొని ఇక్కడి నుంచి బయలుదేరి వెళ్లే ముందు శ్రీ జార్జి ఇట్లా చెప్పారు: "సముద్రంలో చేపలు బాగా దొరకడం లేదని కేరళ మత్స్య పారిశ్రామికులు అంటున్నారు. అసలే అంతంత మాత్రంగా ఉన్న కేరళ ఆహార పరిస్థితి దీనితో మరీ తీసికట్టుగా తయారయింది. ఆహారమండల సమావేశం ఫలితాలు సంతృప్తికరంగా ఉన్నవి. కేరళకు విడవకుండా నెలకు 25 వేల టన్నుల బియ్యం చొప్పున సప్లయి అయ్యేట్టు హామీ ఇచ్చారు. వాస్తవానికి ఇంతకు గట్టెంపు బియ్యం కేరళకు కావాలి.

"వి త్తనాలను వినియోగించి, ఎరువులను వాడి ఇంకా బాగా ఎక్కువగా కేరళలో వ్యవసాయం చేసే కృషిని ప్రోత్సహించేందుకు మా ప్రభుత్వం శాయశక్తులా ప్రయత్నిస్తోంది. గంజి కేంద్రాలను కేరళ ప్రభుత్వం ఏర్పాటుచేయిస్తోంది."

## శ్రీకాకుళంజిల్లా బియ్యం మిల్లు యజమానులు

ఆముదాల వలస, జూలై 4: శ్రీకాకుళం జిల్లాలోని బియ్యం మిల్లు యజమానుల సమావేశం ఈ నెల 8 వ తేదీని ఆముదాల వలసలో జరపడానికి నిశ్చయమైనదని సమావేశకర్త శ్రీ ఎమ్. ఆర్. గోపాలన్ తెలియపరచుచున్నారు. ఈ సమావేశానికి పార్లమెంటు సభ్యుడు శ్రీ జాడేపల్లి రాజగోపాలరావు అధ్యక్షత వహిస్తారు.

అనుమతి పద్ధతివల్ల ఏర్పడుతున్న ఇబ్బందులు గురించి, బియ్యం ధాన్యం విక్రయానికి సంబంధించిన సమస్యలు గురించి సమావేశంలో చర్చలు జరుగుతవి.

భారత ప్రధాని శ్రీ నెహ్రూతో బ్రిటిష్ ప్రధాని శ్రీ మాక్మిలన్.

# స్టెర్లింగు ప్రాంతపు ఆర్థిక స్థితి

## బలపరచడానికి కామన్వెల్త్ ప్రధానుల నిర్ణయాలు

లండన్, జూలై 3: స్టెర్లింగ్ ప్రాంతపు, విదేశ వ్యాపార నికర ద్రవ్యనిధుల పరిస్థితి ఆందోళనకరంగా లేకపోయినా, అజాగ్రత్తగా ఉండదగినదిమాత్రంకాదు, అని కామన్వెల్తు ప్రధాన మంత్రులు అభిప్రాయపడ్డారు.

స్టెర్లింగ్ ప్రాంతాన్ని ఆర్థికంగా బలపరచడానికి సమావేశం స్థూలంగా కొన్ని నిర్ణయాలు చేసుకున్నారు.

అవి 1. స్టెర్లింగ్ ద్రవ్యాన్ని బలపరచడానికి చేతనైన కృషి అంతా జరగాలి.

2. స్టెర్లింగ్ ప్రాంతపు విదేశ వ్యాపార నికరాదాయం పెంచే కృషిలో లోపం ఉండకూడదు. అయితే పేద దేశాల ప్రజల జీవనప్రమాణ అభివృద్ధి అవసరాలను, అలాటి అభివృద్ధికి వ్యవసాయ పారిశ్రామిక అభివృద్ధి అవసరాలను గమనించవలసిందే,

3. ఏ రాజ్యానికి ఆ రాజ్యం న్యాయమైనంత వేగంలో మాత్రమే ఆర్థికాభివృద్ధికి కృషి చెయ్యాలి.

4. అభివృద్ధి పథకాల విషయంలో పూర్వాపరాలను అతిజాగ్రత్తగా గమనించాలి,

5. మంచి షరతులపైన పెట్టుబడి ఎక్కడినుంచి ఏరూపంలో రావడానికి వీలున్నప్పటికీ ఆకర్షించడంకోసం, అంతరంగిక ఆధారాలను పొల్లుపోకుండా కూడ దీసికోవాలి.

స్టెర్లింగ్ ప్రాంతపు ద్రవ్యనిధుల పరిస్థితిని బ్రిటిషు ప్రతినిధి సమీక్షచేశారు.

[స్టెర్లింగ్ ప్రాంతపు నిధుల వివరాలను నిన్నరాత్రి అధికారులు ప్రకటించారు. జూన్‌నెలనాటికి డాలర్ నిధి 3 కోట్ల 60 లక్షలు పెరిగింది. అంటే జూన్ నెలాఖరుకు నిధి మొత్తం 238 కోట్ల పదిలక్షలకు పెరిగింది.]

బ్రిటిషు ప్రతినిధి తన సమీక్షలో, రెండేళ్లకిందట బ్రిటన్ పరపతిని అదుపులో పెట్టినందుకు మంచి ఫలితాలు ఇప్పుడు కనపడుతున్నాయని చెప్పారట.

1955 లో బ్రిటన్‌కు విదేశ వ్యాపారంలో ఇతర దేశాలకు 7 కోట్ల 90 లక్షల పౌనులు చెల్లించవలసివస్తే, కిందటేడు 23 కోట్ల 80 లక్షల పౌనులు మిగులు వచ్చింది. ఈ ఏడాది మే నెలలో ఎగుమతులు బ్రిటన్‌లో ఎన్నడూ లేనంతగా పెరిగాయట.

ఈనాడు బంగారం, డాలర్ల నిధులు 200 కోట్ల డాలర్లకు మించి ఉందని బ్రిటిష్ ప్రతినిధి చెప్పారట.

అయితే కామన్వెల్త్ దేశాల ఆర్థికాభివృద్ధికి ఇప్పట్లో బ్రిటన్ ఆట్టే తోడ్పడలేదని చెప్పారట.

ఇందుకు కారణాలు చాలా ఉన్నాయి. అమెరికా, కెనడాలకు బ్రిటన్ బోలెడు ఋణపడి ఉంది. మలయా, సైప్రస్ మొదలైన ప్రాంతాల్లో బ్రిటిష్ సైనిక వ్యయం పెట్టవలసినది ఇంకా చాలా ఉంది. బ్రిటన్‌లోనే పరిశ్రమలలో ఆధునిక యంత్రపరికరాలు ప్రవేశపెట్టడానికి చాలా పెట్టుబడి కావాలి.

పోతే ఇతర దేశాల్లో పెట్టుబడి పెడితే, ఆ దేశాలు చివరికి జాతీయం చేస్తాయనే భీతి ఉంది. సూయజ్ కాలువ కంపెనీ జాతీయమైన తరవాత ఈ భయం మరింత ఎక్కువయింది.

భారతదేశంలో అభివృద్ధికి అంత ద్రవ్యం పెట్టుబడి పెడితే ఫలితాలెలా ఉంటాయని బ్రిటన్‌కు సంశయం వ్యాపిస్తోంది.

### యూరోపియన్ వ్యాపారవ్యవస్థ

తరువాత యూరోపియన్ స్వేచ్ఛా వ్యాపారవ్యవస్థ గురించి కామన్వెల్త్ ప్రధానులు చర్చించారు.

ఈ వ్యవస్థలో సేద్యఫలాల వ్యాపారాన్ని చేర్చరాదని పట్టుబట్టగలమని బ్రిటిష్ ప్రతినిధి వాగ్దానమిచ్చినట్లు తెలుస్తున్నది.

(కామన్వెల్తులో అనేక రాజ్యాలు వ్యవసాయోత్పత్తి ఎగుమతిపై ఆధారపడివి ఉన్నాయి.)

ఈ యూరోపియన్ పారిశ్రామిక స్వేచ్ఛావ్యాపార పథకాన్ని చాలమంది కామన్వెల్తు ప్రధాన మంత్రులు ఇదివరకే ఆమోదించారు. భారతదేశం మాత్రం ఆ పథకాన్ని వివరంగా పరిశీలించనిదే ఏ అభిప్రాయం వ్యక్తపరచడానికి ఇష్టపడలేదు. అయితే ఈ పథకంలో వలస దేశాల ఎగుమతి దిగుమతి సామగ్రిని కూడా ముడిపెట్టితే, వలస ప్రాంతాల్లో స్వాతంత్ర్యోద్యమాలకు హాని కలగవచ్చని సంశయం వెలిబుచ్చింది.

మొత్తంమీద ఈ వ్యవస్థగురించిన పథకాన్ని కామన్వెల్త్ రాజ్యాల ఆర్థిక శాఖాధికారులు, నిపుణులు చర్చించాలని, వారికి వదిలివేశారు.

### కామన్వెల్త్ బ్యాంకు

తరువాత కామన్వెల్త్ ఆర్థికసంఘం కార్యవిధులను విస్తరింపచేయాలని ప్రధానుల సమావేశం నిర్ణయించింది.

ఈ సంఘం కామన్వెల్త్‌లోని ముడిసామగ్రి ఉత్పత్తి, సహజసంపద మొదలైనవి పరిశీలించడానికి ఇదివరలో ఏర్పడింది.

కామన్వెల్త్ రాజ్యాల ఆర్థికాభివృద్ధికి పెట్టుబడి ద్రవ్యం ఎలా ఆకర్షించాలో ఈ సంఘాన్ని సూచనలు చెయ్యవలసిందని ప్రధానమంత్రులు కోరారు.

కామన్వెల్త్ అభివృద్ధిసంస్థ, దానికి అనుబంధంగా ఒక కామన్వెల్తు బ్యాంకు నెలకొల్పేవిషయమై పరిశీలించాలని ఈ సంఘాన్ని ఆదేశించారు.

తూర్పు ఆసియాలో బలపరచవలసిన దేశం జపాన్‌తో వ్యాపారం ఎలా వృద్ధి చేసుకోవాలని ప్రధానులు చర్చించారు. ఈ సమస్యను ఆర్థిక శాఖాధికారులు, నిపుణుల చర్చకు విడిచిపెట్టారు.

### జమాబందిలో పాల్గొనరాదని గ్రామోద్యోగుల నిర్ణయం

బందరు, జూలై 3: బందరుతాలూకా గ్రామోద్యోగులు నేటి అపరాహ్ణం ఇక్కడి పురమందిరంలో సమావేశమై రేపు ప్రారంభంకానున్న జమాబందికి హాజరు కాకూడదని, రాష్ట్ర సంఘం ఆదేశాలననుసరించి రాష్ట్ర సంఘం ద్వారా తమ రాజీనామాలు సమర్పించాలని తీర్మానించారు. స్వ. వి.

### చిరుతపులి వధ

కాళహస్తి, జూలై 1: దొమ్మర పాలెం-గుండెలగుంట మధ్య చెరువులో నిద్రపోతున్న చిరుతపులిపై అడపాల జ్ఞానయ్య తుపాకి పేల్చగా గురితప్పినది. చిరుతపులి వెంటనే శ్రీ జ్ఞానయ్యపై దూకినది. అరగంటసేపు పోరాటం జరగగా చివరకు తుపాకితో పొడిచి దానిని వధించారు. శ్రీ జ్ఞానయ్యకు బొటనవ్రేలు తెగినది. ఇంకొ గాయాలు తగిలాయి. ఆస్పత్రిలో చేర్చారు.



Printed and Published for Nageswaar Rao Estates (private) Ltd., by S. Radha Krishna. at The Andhra Patrika Press, 6 & 7 Thambu Chetty St., Madras-1. Editor S. Sambhu Prasad.